

# సింద్‌బాద్ అద్భుత యాత్రలు

బొగ్దాద్‌లో ఒక గొప్ప వర్తకుడుండేవాడు. ఆయన వద్ద అపారమైన ధనమూ, ఇతర సంపదా ఉండేది. ఆయన గొప్ప దాత; పేదలకు విరివిగా దానధర్మాలు చేశాడు. ఆ వర్తకుడికి సింద్‌బాద్ అని ఒక కొడుకు ఉండేవాడు.

తండ్రి చనిపోయి సింద్‌బాద్ యుక్త వయస్కుడయే సరికి తండ్రికి గల ఆస్తి అంతా అతనికి సంక్రమించింది. అతను తన యీడువారిని కొందరిని చేరదీసి, వారితో సహా తింటూ, తాగుతూ, విలాసాలలో మునిగితేలుతూ, డబ్బును మంచి నీరులాగా ఖర్చుచేస్తూ మహారాజులాగా కొంతకాలం గడిపాడు. కూర్చుని తింటే కొండలు తరుగుతా యన్నట్టు, సింద్‌బాద్‌కు ఉన్నదంతా చూస్తూండగానే హరించి పోయింది.

అప్పు డతనికి జ్ఞానోదయమయింది. సర్వనాశనం కాకమునుపే అతను తనకు మిగిలినదంతా ధనంగా మార్చుకుని, ఆ డబ్బుతో నౌకావ్యాపారం చేయాలనీ, దాని వంకతో ప్రపంచం చూడాలనీ నిశ్చయించుకున్నాడు. అతను తన వద్ద ఉన్న డబ్బుతో సరుకులు కొని, బాగ్దాదు నుంచి బయలుదేరుతున్న వర్తకనౌక ఒకదానిలో ఎక్కాడు. ఆ నౌక నది వెంబడి బస్రా నగరానికి పోతున్నది. అందులో ఇంకా చాలామంది వర్తకులు తమ సరుకులతో ప్రయాణం చేస్తున్నారు.

బస్రా నుంచి సముద్రయానం ఆరంభమయింది. సముద్రం మీద అనేక దీవుల వద్ద నౌక నిలిచింది. వర్తకులు తమ సరుకులను అమ్మటమూ, ఇతర సరుకులను మారకం వేసుకోవటమూ చేశారు. తరవాత

మొదటి యాత్ర





కొన్ని వారాలపాటు భూమి కనబడకుండానే ప్రయాణం సాగింది.

చివరకు నౌకకు ఒక అందమైన ఆకు పచ్చని దీవి కనిపించింది. సరంగు నౌకను ఆ దీవి వద్దకు చేర్చి లంగరు దించాడు. వర్తకులందరూ తాళ్ళ నిచ్చెనల మీద దీవి పైన దిగారు. వర్తకుల వద్ద ఆహారపదార్థాలూ, వంటపాత్రలూ ఉన్నాయి. కొందరు నిప్పు చేసి వంటలు ప్రారంభించారు. మరి కొందరు సరదాగా షికార్లు కొట్టారు. ఇంకా కొందరు దీవిలో కూర్చుని కబుర్లు చెప్పుకున్నారు. సింద్‌బాద్ వంట చేసుకున్నాడు, తరవాత షికార్లు చేశాడు.

ఇంతలో ఉన్నట్టుండి ఆ దీవి ఒక్కసారిగా కంపించింది. దాని మీద నిలబడి ఉన్నవారంతా కుప్పకూలిపోయారు. భయాందోళనలు వారిని ముంచెత్తాయి. ఇంతలో నౌకలో నుంచి సరంగు ఆవేశంగా కేక పెట్టాడు, "ప్రమాదం! వచ్చెయ్యండి. అది దీవి కాదు, బ్రహ్మాండమైన తిమింగిలం. అది మంటల వేడికి కదులుతున్నది. మునిగిపోతుంది! చచ్చిపోతారు, వచ్చెయ్యండి."

ఈ మాటలు వింటూనే వర్తకులు ఎక్కడి వస్తువులను అక్కడే వదిలేసి, ప్రాణాలు దక్కించుకోగలందులకు నౌకకేసి పరిగెత్తారు. త్వరలోనే నౌక లంగరు ఎత్తి కదిలింది. కొందరు వర్తకులు నౌకను అందుకోగలిగారు గాని, మరి కొందరు అందుకోలేక పోయారు. వారిలో సింద్‌బాద్ కూడా ఉన్నాడు. ఇంతలో తిమింగిలం మునగనే మునిగింది. నౌకను అందుకోలేకపోయిన వారంతా, సింద్‌బాద్ సహా, సముద్రం పాలయారు.

మిగిలినవారి మాట ఏమైనా, సింద్‌బాద్ అదృష్టం బాగుండి అతనికి ఒక కొయ్య తొట్టి చిక్కింది; అందులో ఎవరో వర్తకులు బట్టలు ఝాడించుకున్నారు. ఆ తొట్టి

సహాయంతో సింద్‌బాద్ సముద్రం మీద తేలి ఉండగలిగాడు. అతను ఎంతో శ్రమ పడి, బోర్లాపడి తేలుతున్న ఆ తెప్పపైన ఎక్కి కూర్చుని, కాళ్ళతో నీటిని వెనక్కు తోస్తూ నౌక కేసి పోవటానికి ప్రయత్నించాడు. కాని నౌక, తెరచాపలన్నిటినీ ఎత్తి, శీఘ్రంగా ప్రయాణిస్తూ, కొద్దిసేపటిలోనే కనుమరుగైపోయింది. అంతలోనే చీకటి కూడా ముంచుకొచ్చింది.

తాను ఆ సముద్రం నుంచి ప్రాణాలతో బయటపడతానని సింద్‌బాద్ అనుకోలేదు. ఆ రాత్రి, మరునాటి రోజంతా అతను అలల తాకిడి అనుభవిస్తూ, చివరకు ఒక దీవి మీద వచ్చి పడ్డాడు. తీరం వెంబడి కొండలు నిటారుగా లేచి ఉన్నాయి. అయితే ఆ కొండల పై భాగం నుంచి ఏవో లతలు కిందికి దిగివచ్చి, సముద్రంలోకి కూడా విస్తరించి ఉన్నాయి. సింద్‌బాద్ తన శరీరంలో ఉన్న కాస్త శక్తినీ కూడ గట్టుకుని, ఎక్కడలేని బలమూ తెచ్చుకుని, ఆ లతలను పట్టుకుని ఎగబాకి, పైకి చేరుకున్నాడు.

పైకి చేరగానే అతనికి తాను పడ్డ బాధ అంతా ఒక్కసారి పైకి వచ్చేసింది. అతని అవయవాలన్నీ హూనమై ఉన్నాయి. చేపలు అతని కాళ్ళను ఘోరంగా కొరికేశాయి.





బాధతోనూ, అపరిమితమైన నీరసంతోనూ అతనికి స్పృహతప్పిపోయింది.

ఒక రోజంతా అతను ఒళ్ళు తెలియకుండా పడి ఉండి, మర్నాడు తన ముఖం మీద ఎండ పడేసరికి మేలుకున్నాడు. లేవబోయి కిందపడి, మోకాళ్ళ మీద పాకుతూ అతను ఒక సమతలం చేరుకున్నాడు.

అది అతని పాలిటికి స్వర్గమనిపించింది. అక్కడ మంచి పళ్ళచెట్లు ఉన్నాయి, మంచినీటి సెలయేళ్ళు కూడా ఉన్నాయి. ఆ పళ్ళు తిని, నీరు తాగి ఆకలి దప్పులు తీర్చుకుంటూ ఆ ప్రదేశంలో చాలారోజులు గడిపి, శరీర బాధల నుంచి అతను క్రమంగా కోలుకున్నాడు. రెండు చంకకర్రలు తయారు చేసుకుని, వాటి సహాయంతో అతను చెట్ల మధ్యగా తిరుగుతూ, పళ్ళు తింటూ, విధివిలాసాన్ని గురించి ఆశ్చర్యపడుతూ కాలం వెళ్ళబుచ్చసాగాడు.

ఒకనాడు సింద్‌బాద్ సముద్రతీరం వెంబడి నడుస్తూండగా అతని కళ్ళకు ఒక గుర్రం కనిపించింది. అది మామూలు గుర్రాలలాగా లేదు. సింద్‌బాద్ దాన్ని చూద్దామని సమీపంగా వెళ్ళేసరికి, అకస్మాత్తుగా ఒక వ్యక్తి ఎక్కడి నుంచో ఊడిపడి, "ఎవరు నువ్వు? ఎక్కడి నుంచి వచ్చావు? ఇక్కడికి ఎలా రాగలిగావు?" అని అడిగాడు.

"అయ్యా, నేను సముద్రం మీద ప్రయాణం చేస్తూండగా మాలో కొందరం సముద్రం పాలయాం. దేవుడి దయవల్ల నేను దీవికి ప్రాణాలతో చేరుకోగలిగాను," అన్నాడు సింద్‌బాద్.

ఆ మనిషి అతని చెయ్యి పట్టుకుని భూగర్భంలోకి తీసుకుపోయాడు. అక్కడ ఒక విశాలమైన సావడి లాటిది ఉన్నది. ఆ మనిషి సింద్‌బాద్‌ను ఒక ఉన్నతాసనంలో కూర్చోబెట్టి, అతడికి మంచి భోజనం పెట్టాడు.

కడుపునిండాక సింద్‌బాద్ తన కథ అంతా చెబుతూంటే ఆ మనిషి ఆశ్చర్యంతో విన్నాడు. తరవాత సింద్‌బాద్ కోరగా అతను తన కథ కూడా చెప్పాడు.

అతనికి భోజనం పెట్టిన మనిషి గుర్రాలను పట్టుకునేవాడు. అలాటివాళ్ళు ఆ దీవి అంతటా అక్కడక్కడా ఉన్నారు. వారందరూ మిర్జాన్ మహారాజు నౌకర్లు. ప్రతి అమావాస్యనాడూ సముద్రంలో నుంచి వింత గుర్రాలు దీవి పైకి వస్తాయి. వాటిని పట్టుకోవటమే ఈ కాపావాళ్ళ పని.

"నన్ను కలుసుకోవటం మంచిదయింది. ఒంటరిగా ఈ దీవి మీద నిష్కారణంగా చచ్చిపోయేవాడివి. నిన్ను మా మహారాజు దగ్గిరికి తీసుకుపోతాను," అన్నాడు కాపావాడు సింద్‌బాద్‌తో.

వాళ్ళు ఇలా మాట్లాడుకుంటూండగానే మిగిలిన కాపావాళ్ళు కూడా అక్కడికి చేరారు. తరవాత అందరూ మిర్జాన్ మహారాజు భవనానికి బయలుదేరారు. వాళ్ళు సింద్‌బాద్‌ను ఒక గుర్రం మీద కూర్చోబెట్టి తీసుకుపోయారు.

ముందుగా కాపావాళ్ళు మిర్జాన్ మహారాజుకు సింద్‌బాద్ వృత్తాంతం చెప్పాక, అతనికి రాజదర్శనం లభించింది. మిర్జాన్ సింద్‌బాద్‌కు ఆదరపూర్వకంగా స్వాగత





మెచ్చి, అతని నోటనే అతని కథ అంతా ఆశ్చర్యపోతూ విన్నాడు.

"నాయనా, నువ్వు ఇన్ని గండాలు గడిచి బతికావంటే నీ ఆయుషు గట్టిది," అని ఆ మహారాజు సింద్‌బాద్‌ను తన ఆప్త వర్గంలో చేర్చుకుని, అతనికి ఒక ఉద్యోగం ఇచ్చాడు. రేవులు తణిఖీ చెయ్యటమూ, నౌకావ్యాపార వ్యవహారాలు చూడటమూ అతని పని.

ఇది చాలా తేలిక పని. సింద్‌బాద్‌కు బోలెడంత విశ్రాంతి ఉండేది. అందుచేత అతను రోజూ రాజును కలుసుకుని మాట్లాడుతూ ఉండేవాడు. రాను రాను మహారాజుకు అతనిపై గొప్ప అభిప్రాయం ఏర్పడింది. సింద్‌బాద్ ఆయనకు అత్యంత సన్నిహితుడయాడు.

సింద్‌బాద్‌కు ఏ కొరతా లేదు గాని తన దేశానికి దూరమైన బాధ అతన్ని వదల లేదు. అస్తమానమూ అతను తన దేశం గురించే ఆలోచించేవాడు. ఎలాగైనా అక్కడికి తిరిగి వెళతానన్న ఆశ అతనిలో చావలేదు. రేవులోకి దేశాంతరాల నౌకలు వచ్చినప్పుడల్లా అతను నావికులను, "బాగ్దాదునగరం ఏ దిక్కుగా ఉంటుంది?" అని అడిగేవాడు. కాని వారిలో ఒక్కడైనా బాగ్దాదునగరం పేరు విన్నవాడు లేక పోయాడు. స్వదేశానికి తిరిగి వెళ్ళాలన్న ఆరాటమూ, పోలేనేమోనన్న భయమూ అతనిలో క్రమంగా పెరగసాగాయి.

ఒకనాడు సింద్‌బాద్ రేవులో నిలబడి నౌకల కోసం నిరీక్షిస్తూ ఉండగా ఒక పెద్ద నౌక వచ్చి, రేవులో లంగరు దించింది. నౌక వాళ్ళు కిందికి జార్చిన తాటినిచ్చెన ఎక్కి సింద్‌బాద్ నౌకలోకి వెళ్ళాడు. సరంగు సహాయంతో అతను నౌకలోని సరుకులు తణిఖీ చెయ్యటం ప్రారంభించాడు. నావికులు సరుకులు తెచ్చి చూపుతూ ఉంటే అతను జాబితా రాసుకున్నాడు.

జాబితా పూర్తి అయాక సింద్‌బాద్ సరంగుతో, "సరుకులన్నీ అయిపోయాయా? ఇంకేమీ లేవా?" అన్నాడు.

"ఉన్నది, బాబూ. అయితే అది విక్రయసామగ్రి కాదు. అందుచేత దాన్ని నౌక అడుగున పెట్టి ఉంచాను. ఆ సరుకుగల మనిషి సముద్ర మధ్యాన మునిగిపోయాడు. అందుచేత, వీలు చిక్కినప్పుడు దాన్ని అతని బంధువులకు చేర్చాలి. వాళ్ళది బాగ్దాదు నగరం," అన్నాడు సరంగు. సింద్‌బాద్ గుండె అమిత వేగంగా కొట్టుకోసాగింది.



"అయ్యా, ఆ మునిగిపోయిన మనిషి పేరేమిటి?" అని అతను సరంగును అడిగాడు.

"సింద్‌బాద్!" అని సమాధానం చెప్పాడు సరంగు.

సింద్‌బాద్ ఇప్పుడు సరంగును మరింత పరీక్షగా చూసి గుర్తించాడు. తనను సముద్రంలో వదిలేసి నౌకను నడుపుకుంటూ వెళ్ళిపోయినది ఈ సరంగే.

"నేనే సింద్‌బాదును!" అని సింద్‌బాద్ పెద్ద కేక పెట్టాడు.

ఆ తరవాత అతను సరంగుకు తాను పడ్డ కష్టాలన్నీ చెప్పాడు. కాని సరంగు ఆ మాటలు నమ్మక, "ఎంత మోసం! ఎంత మోసం! మా కళ్ళ ఎదుట సింద్‌బాద్ సముద్రంలో మునిగాడు కదా, అతనే నువ్వని అబద్ధాలాడటానికి నీకు సిగ్గు లేదూ?" అన్నాడు.

"నేనే సింద్‌బాదును. అబద్ధం ఆడవలసిన అవసరం నాకేమీ లేదు," అంటూ సింద్‌బాద్, తిమింగిలాన్ని దీవి అనుకుని దానిపైన దిగక ముందు జరిగిన వివరాలన్నీ చెప్పాడు. అతని మాటలను సరంగు నమ్మక తప్పలేదు. అతను నౌకలో ఉన్న ఇతర వర్తకులందరినీ పిలిచి, వారికి సింద్‌బాద్‌ను పరిచయం చేశాడు. సింద్‌బాద్

వారి కందరికీ తన వింత కథను చెప్పాడు. వారంతా చావునుంచి తప్పించుకున్నందుకు అతన్ని అభినందించారు.

సింద్‌బాద్ సరుకంతా భద్రంగానే ఉన్నది. సరంగు దాన్ని సింద్‌బాద్ పరం చేశాడు. తన సామానులో అమూల్యమైన వాటిని మిర్జాన్ మహారాజుకు కానుక ఇవ్వటానికి ఉంచి, మిగిలినదంతా బజారుకు తీసుకుపోయి అమ్మేసి, సింద్‌బాద్ తన పెట్టుబడి మీద నూరింతలు లాభం చేసుకున్నాడు.

సింద్‌బాద్ సంగతి తెలియగానే మిర్జాన్ చాలా సంతోషించాడు. ఆయన తాను స్వీకరించిన కానుకల కన్న అనేక రెట్లు విలువగల బహుమానాలను సింద్‌బాద్‌కు ఎదురిచ్చాడు. వాటిని కూడా అమ్మేసి సొమ్ము చేసుకుని, ప్రయాణసన్నాహాలు పూర్తి చేసుకుని, చివరిసారి రాజదర్శనం చేసుకుని, ఆయన చూపిన దయకు కృతజ్ఞత తెలుపుకుని, సింద్‌బాద్ నౌకలో ప్రయాణమయాడు. సింద్‌బాద్ వెళ్ళిపోయేటప్పుడు మిర్జాన్‌రాజు తన దేశంలో పుష్కలంగా దొరికే అత్తర్లూ, మంచి గంధమూ, హారతి కర్పూరమూ, సాంబ్రాణీ మొదలైనవి అతనికి కానుకగా ఇచ్చాడు. వాటితో సహా సింద్‌బాద్ నౌకలో ఎక్కి అనేక రోజులు ప్రయాణం చేసి, బస్రా నగరం మీదుగా బాగ్దాదు చేరుకున్నాడు.

దైవకృప వల్ల అతని బంధువులందరూ క్షేమంగా ఉన్నారు. అతను తాను సంపాదించుకు వచ్చిన ధనంతో అనేక భవంతులనూ, తోటలనూ, ఇతర ఆస్తినీ, బానిసలనూ, దాసదాసీ జనాన్నీ కొనుక్కుని, తన తండ్రి పోయేనాడుండిన దానికన్న హెచ్చు ఆస్తిని సంపాదించుకున్నాడు. అతను సమస్త భోగాలూ అనుభవిస్తూ తన తొలి ప్రయాణంలో కలిగిన బాధలన్నిటినీ త్వరలోనే మరిచి పోగలిగాడు.

—(ఇంకా వుంది)





# సింద్‌బాద్ అద్భుతయాత్రలు

కొంత కాలం సుఖాలలో మునిగి తేలాక సింద్‌బాద్‌కు విలాస జీవితం మొహం మొత్తింది. అతనికి కొత్త దేశాలు చూడాలనీ, కొత్త విషయాలు తెలుసుకోవాలనీ కోరిక కలిగింది. దేశాటన లాభసాటిగా ఉండాలంటే వర్తకం చేయాలి. అందుచేత అతను బజారులో వర్తకానికి యోగ్యమైన సరుకులు కొని, మూటలు కట్టించుకుని, వాటితో సహా ఓడలరేవు చేరాడు.

త్వరలోనే రేవులోకి ఒక మేలైన ఓడ వచ్చింది. అది సముద్రయానాలకు దివ్యంగా పనికివచ్చే ఓడ. దానికి అందమైన, పెద్ద పెద్ద తెరచాపలున్నాయి. దాన్ని చూడగానే సింద్‌బాద్‌కు ఆ నౌకలో ప్రయాణం చెయ్యాలనిపించింది. అతనికి తెలిసిన మరికొందరు వర్తకులు కూడా అందులోనే ప్రయాణం చేస్తున్నారు. సింద్‌బాద్ తన సరుకును కూడా అందులోనే ఎక్కించి, మిత్రులతో ప్రయాణం సుఖంగా సాగుతుందిగదా అనుకున్నాడు.

ఆ ఓడ సముద్రంమీద చాలా చురుకుగా ప్రయాణం సాగించింది. అనేక దీవులలో ఓడ నిలిచింది. వర్తకులు అక్కడి అధికార్లతో పరిచయం చేసుకుని, అక్కడి వర్తకులకు తమ సరుకులు అమ్మి, వారి సరుకులు కొన్నారు. ఇలా అనేక వారాలపాటు ప్రయాణం విజయవంతంగా సాగి, అనేక రేవులలో వ్యాపారం జరిగి, చివరకు ఓడ ఒక దీవిని చేరింది.

అది నిర్జనమైన దీవి లాగా కనబడింది. ఎక్కడా మనుష్య సంచారం లేదు. దీవి మీద ఎత్తయిన చెట్లున్నాయి. వాటి మీద రకరకాల పక్షులు మనోహరంగా కూస్తున్నాయి. దీవి మీద సెలయేళ్ళు గలగలా ప్రవహిస్తున్నాయి. ఆ ప్రదేశం భూలోక స్వర్గంలాగున్నది.



వర్తకులు ఓడదిగి దీవిపైన, చెట్లమధ్యగా పికార్లు చేశారు. సింద్‌బాద్ కొంత ఆహారం తీసుకుని, ఒక సెలయేటి ఒడ్డున చెట్లనీడన కూర్చుని, తిండి తిని, పచ్చని గడ్డి మీద పవళించి నిద్రావస్థలో పడిపోయాడు.

అతనికి తిరిగి మెలకువ వచ్చేసరికి దీవి మీద ఎవరూ లేరు. రేవులో ఓడ కనుపించలేదు. అతను రేవులోకి పరిగెత్తి వెళ్ళి చూస్తే చాలా దూరంగా తెరచాపలు కనిపించాయి. సింద్‌బాద్ సంగతి గమనించక, మిగిలినవారితో ఓడ బయలుదేరి పోయింది. సింద్‌బాద్ చూస్తూండగానే ఓడ కనుచూపుమేర దాటిపోయింది.



సింద్‌బాద్ కుంగిపోయాడు. అతని నిస్పృహ వర్ణనాతీతం. అతని సరుకంతా ఓడతో వెళ్ళిపోయింది. అతను కట్టుబట్టలతో ఒక నిర్జనమైన దీవిమీద దిగబడిపోయాడు. తన గతి తలుచుకుంటే అతనికి మతి పోయినంత పని జరిగింది. మొదటి ప్రయాణంలో అతనికి విధి తోడయింది. ప్రతిసారి విధి సహకరిస్తుందని ఎలా చెప్పటం? చేతి నుంచి జారిపడిన కూజా మొదటిసారి పగలకపోతే, రెండోసారైనా తప్పక పగిలి తీరుతుంది!

అతను పెద్ద పెట్టున ఏడ్చాడు. తల బాదుకున్నాడు. దేవభోగాలు అనుభవిస్తూ బాగ్దాదులో సుఖంగా జీవించేవాడికి ప్రపంచం చూడాలనీ, ఇంకా డబ్బు సంపాదించాలనీ ఎందుకు దుర్బుద్ధి కలగాలి? మొదటి ప్రయాణం సుఖంగా జరిగి ఉంటే పోనీ అనుకోవచ్చు. కాని అప్పుడూ అష్టకష్టాలు పడ్డాడు తాను! కాని అప్పుడు ఏమనుకుని ఏం లాభం? ఎవడికి ఏ విధంగా చావు వచ్చేదీ ఎవరు చెప్పగలరు?

ఈ విధంగా కొంతసేపు తనను తాను తిట్టుకుని ఏడ్చాక సింద్‌బాద్ తన దిగ్భ్రమ నుంచీ, నైరాశ్యం నుంచీ క్రమంగా కోలుకుని, కర్తవ్యం గురించిన ఆలోచనలో





వచ్చాడు. జరిగిందేదో జరిగింది. ఇప్పుడు తానున్న ప్రదేశం ఎలాటిదో తెలుసుకోవాలి. అందుచేత అతను చెట్లమధ్యగా నడుస్తూ దీవి లోపలికి బయలుదేరాడు. కొంతదూరం పోయాక అతనికి ఏ క్రూరమృగాలైనా ఎదురువస్తాయేమో నని భయం కలిగింది. వెంటనే అతను ఎత్తయిన చెట్టు ఒకటి ఎక్కి, దాని పైభాగం నుంచి చుట్టూ కలయచూశాడు.

చుట్టూ అతనికి చెట్లూ, పక్షులూ, కొండలూ, గుట్టలూ తప్ప ఇంకేమీ కనిపించలేదు. కాని ఒక దిక్కుగా ఏదో తెల్లని కట్టడంలాటిది కనబడింది. అతనికి దాన్ని చేరాలన్న ఆత్రం కలిగింది.

అతను వెంటనే చెట్టు దిగి ఆ దిక్కుగా నడవసాగాడు. ఏం ప్రమాదం ఎదురవుతుందో నని అతను చిన్న చిన్న అడుగులు వేస్తూ ఆ తెల్లని కట్టడంలాటి దాన్ని చేరుకున్నాడు. అది ఎత్తయిన బురుజు లాగా ఉన్నది. లోపలికి దారి ఉందేమోనని దాని చుట్టూ ప్రదక్షిణం చేశాడు. కాని ఎక్కడా ద్వారమన్నది లేదు. దానిమీదికి ఎక్కి చూద్దామంటే, అది పాలగచ్చులాగా ఉండటంచేత అతని కాలికి పట్టు చిక్కలేదు. దాని ప్రమాణం ఎంత ఉందో చూడటానికి అంగలు లెక్కిస్తూ దానిచుట్టూ మళ్ళీ తిరిగాడు. దాని చుట్టుకొలత నూట యాభై అంగలున్నది!

ఎలాగైనా ఆ బురుజులోకి పోయే మార్గం తెలిస్తే బాగుండునని సింద్‌బాద్ అనుకుంటూండగా అకస్మాత్తుగా సూర్యుడు అస్తమించి చీకటి వచ్చేస్తున్నట్టయింది. సూర్యుడికి కారుమేఘం ఏదైనా అడ్డు వచ్చిందనుకోవటానికైనా వేసవి కాలం! కారుమేఘాలుండవు! అతను తల ఎత్తి సూర్యుడి దిక్కుగా చూసేసరికి ఒక బ్రహ్మాండమైన పక్షి కనిపించింది. దాని రెక్కలు పెద్ద పెద్ద మేఘాల ప్రమాణంలో ఉన్నాయి.



సింద్‌బాద్ మొదట తాను భ్రమపడు తున్నాననుకున్నాడు, కాని అతను ఒకప్పుడు గండభేరుండపక్షులను గురించి విన్నది గుర్తుకొచ్చింది. అవి ఏనుగులను సైతం అవలీలగా ఎత్తుకు పోగలవని యాత్రికులు చెప్పేవారు. అవి సముద్ర మధ్యంలో ఏదో దీవిలో ఉన్నాయట. ఇది గండభేరుండ పక్షే అయి ఉండాలి. తాను చూసిన తెల్లటి బురుజులాటిది, ఇసుకలో కొంత భాగం కూరుకుపోయిన గండభేరుండపక్షి గుడ్డు కావచ్చునని సింద్‌బాద్ ఊహించాడు.

ఆ ఊహ నిజమే అయింది. ఎందు చేతనంటే ఆ పక్షి తిన్నగా వచ్చి ఆ గుడ్డు మీదనే వాలి, తన రెక్కలను దాని చుట్టూ పొదిగి, నిద్రకు ఉపక్రమించింది.

పక్షి నేలమీదకు వాలే సమయానికి సింద్‌బాద్ ఇసుకలో బోర్లా పడుకున్నాడు. దాని కాలు ఒక చెట్టుమానులాగా ఉన్నది. అతను లేచి, తన తలపాగా తీసి, జడుముగా మెలిపెట్టి, మోకు తయారుచేసి, దానితో తనను తాను ఆ పక్షి కాలికి దృఢంగా కట్టుకున్నాడు. ఎప్పటికైనా ఈ పక్షి లేచి పోతుంది. దానితో కూడా తాను ఈ నిర్మానుష్యమైన దీవి నుంచి వెళ్ళిపోవచ్చుననీ, అది మనుషులుండే చోట వాలితే తాను తిరిగి మనుషుల మధ్యకు చేరవచ్చుననీ అతని ఆశ.

సింద్‌బాద్ తనను తాను కాలికి బంధించు కుంటూంటే ఆ పక్షికి ఈగ వాలినట్లయినా ఉన్నట్టు కనబడ లేదు. ఆ పక్షి ఏ రాత్రి వేళ ఎగిరి పోతుందోనని సింద్‌బాద్ తెల్ల వార్లూ మేలుకునే ఉన్నాడు. కాని బాగా తెల్లవారినాకనే, ఆ పక్షి ఒక భయంకరమైన అరుపు అరిచి, గాలిలోకి లేచింది. అది ఎంతో ఎత్తున అతివేగంగా ఎగురుతూ వెళ్ళి ఒక రాతి మీద వాలింది.

అది మళ్ళీ లేచే లోపల సింద్‌బాద్ తన కట్లు విప్పుకుని అవతలికి వచ్చేశాడు. మరు

క్షణమే ఆ పక్షి గాలిలోకి లేచినప్పుడు దాని కాళ్ళసందున ఒక నల్లని, అమితలావైన పాము ఉండటం సింద్‌బాద్ గమనించాడు. దాన్ని చూసే అతను రాయి అనుకున్నాడు!

సింద్‌బాద్ చుట్టూ చూసి భయంతో కొయ్యబారి పోయాడు. అతను దిగినది ఒక లోయ. దాని చుట్టూ ఎత్తయిన కొండ లున్నాయి. అవి కూడా లోయ వైపు నిటారుగా ఉన్నాయి. వాటి మీదికి ఎక్కటం అసాధ్యం. ఈ లోయ నిర్జలమైనది. అక్కడ గడ్డిపరక కూడా మొలవదు. అక్కడ ఆకలి దప్పులతో చావటం నిశ్చయం. సింద్‌బాద్ ఒక ప్రమాద ప్రదేశం నుంచి తప్పించుకుని అంతకన్న కూడా హెచ్చు ప్రమాదం గల చోట పడ్డాడు!

సింద్‌బాద్ ఆ లోయలో నడవ నారంభించాడు. అక్కడి రాళ్ళలో మణు లుండటం చూసి అతనికి ఆశ్చర్యం కలిగింది. కొన్ని చోట్ల మణులు రాళ్ళ నుంచి ఊడి కుప్పలుగా కూడా పడి ఉన్నాయి. కాని వాటిని చూసి ఆనందించే అవకాశం కూడా లేకుండా, రాళ్ళగుట్టల మధ్యగా పాకుతూ తాటిబొంద ప్రమాణం గల పాములు అతని కళ్ళ పడ్డాయి. అవి రాత్రి పూట యథేచ్ఛగా లోయ అంతటా సంచరించి, పగటివేళ గండభేరుండపక్షుల కళ్ళ





పడకుండా దాక్కోవటానికి తమ రహస్య స్థలాలకు పోతున్నాయి. సింద్‌బాద్ తన ఆకలిదప్పులు కూడా మరచి, ఆ పాములకు సాధ్యమైనంత దూరంగా మసలుకోవటంలోనే పగలంతా గడిపాడు.

చీకటి పడే సమయానికి అతనికి ఒక కొండ బిలం కనిపించింది. అది అతను దూర దగినంతే ఉన్నది. అతను ఆ బిలంలో దూరి, దానికి రాయి ఒకటి అడ్డం పెట్టాడు. ఇంతలో అతని కొక భయంకరమైన విషయం తెలియ వచ్చింది. అతను దూరిన బిలం ఒక పాముపుట్ట. ఈ సంగతి తెలియగానే అతను మూర్ఛపోయాడు.

తిరిగి స్పృహ తెలిసి, అతను ఆ పాము పుట్ట నుంచి బయటికి వచ్చేసరికి రాత్రి గడిచిపోయింది.

ఆకలి దప్పులతోనూ, భయాందోళనలతోనూ సింద్‌బాద్ చాలా చాలా నీరసించి ఉన్నాడు. అతను బలహీనమైన కాళ్ళమీద నిలబడి, తనను ఆ పాము మింగనందుకు సంతోషిస్తూ ఉండగా ధపామని ఒక పెద్ద మాంసఖండం అతని సమీపంలోనే పడింది. తల ఎత్తి చూస్తే ఎవరూ కనిపించ లేదు. కాని ఎప్పుడో విన్న ఒక మాట అతనికి జ్ఞాపకం వచ్చింది.

రత్నాల లోయ నుంచి రత్నాలు సంగ్రహించేవాళ్ళు, గొర్రెల మాంసం ముక్కలను లోయలోకి విసురుతారు. ఒక్కొసారి రత్నాలు ఆ మాంసంలో ఇరుక్కుంటాయి. తరవాత గండభేరుండపక్షులు ఆ మాంసం ముక్కలను తన్నుకుపోయి, కొండల మీద ఉండే తమ నివాసాలకు చేర్చుతాయి. రత్నాలు సంగ్రహించేవారు పెద్ద అట్టహాసం చేసి, ఆ పక్షులను వాటి నివాసాల నుంచి తరిమేసి, ఆ మణులను తెచ్చుకుంటారు.

వెంటనే సింద్‌బాద్ రత్నాల లోయ నుంచి తప్పించుకునే ప్రయత్నం ప్రారంభించాడు. అతను పెద్ద పెద్ద రత్నాలను

వీటి తన వంటి మీద వీలున్న చోటనల్లా దాచుకున్నాడు. తరవాత, తన పక్కన పడిన మాంసం ముక్కను తలపాగాతో తన పొట్టకు కట్టుకుని, వెల్లికిలా పడుకున్నాడు. కొంతసేపట్లో ఏదో పక్షి వచ్చి, మాంసం ముక్కతో సహా అతన్ని తన కాళ్ళలో అరికించుకుని, ఎగిరిపోయి తన నివాసం వద్ద దించింది. వెంటనే అది మాంసాన్ని, సింద్‌బాద్‌నూ కూడా ముక్కుతో చీల్చి, తన పిల్లలకు మేపసాగింది.

అదృష్టవశాన అంతలో భయంకరమైన చప్పుళ్ళు వినబడ్డాయి. పక్షి ఎగిరిపోయింది. సింద్‌బాద్ ఒళ్ళంతా రక్తం కారుతూ, లేచి నిలబడ్డాడు. ఆ సమయంలో ఒక వర్తకుడు పరిగెత్తుకుంటూ వచ్చి, సింద్‌బాద్‌ను చూసి నిర్ఘాంతపోయాడు, తరవాత మాంసం ముక్కను పరీక్షించాడు. అందులో రత్నాలు లేవు. అతను సింద్‌బాద్‌తో, "మోసం! దగా! ఎవరు నువ్వు? నా సొత్తు దొంగిలించ వచ్చావా?" అన్నాడు కోపంగా.

సింద్‌బాద్ శాంతంగా, మోసం ఏమీ జరగలేదనీ, తాను రత్నాల లోయలో ఏరిన రత్నాలు కొన్ని అతనికి ఇస్తాననీ అన్నాడు. సింద్‌బాద్ ఇచ్చిన రత్నాలు చూసి ఆ మనిషి మెత్తబడ్డాడు. అతను సింద్‌బాద్‌ను తెగ పొగడి, "అలాటి మణి ఒకటి ఉంటే



దారు! ఎంత గొప్ప రత్నవర్తకుడి వద్దా ఇంత పెద్ద రత్నాలు చూడలేదు. రాజుల వద్ద కూడా అలాటివి ఉండవు," అన్నాడు.

అంతలో మరికొందరు వర్తకులు కూడా చేరారు. సింద్‌బాద్ తన కథనంతా వారికి చెప్పాడు. ఒక మానవమాత్రుడు రత్నాల లోయలోకి అడుగు పెట్టటమూ, తిరిగి ప్రాణాలతో బయటికి రావటమూ వారికి అమిత ఆశ్చర్యం కలిగించింది. వాళ్ళు సింద్‌బాద్‌ను అభినందించారు.

సింద్‌బాద్ వారి వెంట వారి గుడారానికి వెళ్ళి, తన ఆకలి దప్పులు తీర్చుకుని ఆ పూటా, రాత్రీ ఏకనిద్ర పోయాడు. మర్నాడు ఉదయం అందరూ కలిసి బయలుదేరి సముద్రతీరాన్ని చేరుకున్నారు.

అక్కడి నుంచి వారు ఓడలో బయలు దేరి కర్పూరద్వీపానికి వెళ్ళారు. అక్కడ కర్పూరం చెట్ల కింద ఎంత వేసవిలోనైనా చల్లగా ఉంటుంది. ఆ చెట్టుమానులకు గాట్లు పెట్టి, కుండలలో వాటి సొనను పట్టి, దాని నుంచి హారతికర్పూరం తయారు చేస్తారు.

ఆ ద్వీపంలోనే సింద్‌బాద్ ఒక రాక్షస ఖడ్గమృగాన్ని చూశాడు. అది శాకాహారే గాని చాలా భయంకరమైనది. అది తన ముట్టె పైన ఉండే కొమ్ముతో ఏనుగును అవలీలగా గుచ్చి పైకెత్తెయ్యగలదు.

సింద్‌బాద్ ఆ కర్పూర ద్వీపంలో కొద్ది రోజులు సుఖంగా గడిపి, తాను తెచ్చిన మణులలో కొన్ని అమ్మి, వెండి, బంగారాలు కొన్నాడు. అక్కడినుంచి బయలుదేరి, ఎన్నో దీవులూ, దేశాలూ, నగరాలూ చూస్తు ఉంటూ చివరకు, తన స్వస్థలమైన బాగ్దాదు చేరుకున్నాడు. మళ్ళీ అతని జీవితం రాజోచితంగా వెళ్ళసాగింది. ఎక్కడెక్కడి వాళ్ళూ వచ్చి, అతని అనుభవాలు చెప్పించుకుని ఆశ్చర్యపోయేవారు.

సింద్‌బాద్ రెండవ అద్భుతయాత్ర అలా ముగిసింది.





# సింద్‌బాద్ అద్భుతయాత్రలు

తిరిగే కాళ్లూ, తిట్టే నోరూ ఊరుకోవంటారు. సింద్‌బాద్ ఐశ్వర్యంలో ఓలలాడుతూ, రాజభోగాలు అనుభవిస్తున్నాడు. అయినా అతనికి సుఖజీవనం మొహంమొత్తి, దేశాటన మీదికి మనసు మళ్ళింది. దానితో బాటు వర్తకం చెయ్యాలన్న కాంక్ష కూడా కలిగింది. అతను ఖరీదైన వర్తకపు సరుకులు కొని వాటితో బస్రా చేరుకుని, అక్కడ సిద్ధంగా ఉన్న వర్తకపు ఓడలో ఎక్కాడు. అందులో అతని స్నేహితులైన వర్తకులు చాలామంది ఉన్నారు. అతనికి ఏపాటి చిక్కులు వచ్చినా వారు ఆదుకోగలవారే.

కొంత కాలం ప్రయాణం చాలా విజయవంతంగా సాగింది. ఓడ రేవు తాకిన చోటల్లా చురుకుగా వర్తకం సాగింది. సింద్‌బాద్ అనేక కొత్త స్థలాలూ, ఎన్నో కొత్త వింతలూ చూశాడు. వర్తకులందరూ చాలా ఉల్లాసంగా ఉన్నారు.

ఓడ ముస్లిము దేశాలు అధిగమించి సముద్రమధ్యాన్ని చేరుకున్నది. ఆ సమయంలో ఓడసరంగు ఆకస్మాత్తుగా నుదురు బాదుకుని, చొక్కా చింపుకుని, తలపాగా విసిరి కింద కొట్టాడు.

అతని ఆందోళన చూసి వర్తకులు, "ఏమయింది?" అని అడిగారు.

"అయ్యో, గాలి మనని మోసగించింది. మన దురదృష్టం వల్ల రాగూడని ప్రాంతానికి వచ్చాం. ఆకాశం అంచున కనిపించే ఆ దీవి చూడండి. ఆ దీవిని మనం చేరబోతున్నాం. అక్కడికి వెళ్ళి ప్రాణాలతో తిరిగి వచ్చినవాడు ఇంతవరకు లేడు. అది మర్కటాల దీవి. మనకు నూకలు చెల్లిపోబట్టే ఈ దీవికి వచ్చిపడుతున్నాం," అన్నాడు సరంగు.

అతను ఈ మాటలింకా ముగించక ముందే దీవి నుంచి వింతమృగాలు సము

మూడవ యాత్ర



ద్రంలో ఈదుకుంటూ వచ్చి, ఓడను చుట్టు ముట్టాయి. మరి కొన్ని తీరానే ఉండి భయంకరంగా అరుస్తున్నాయి. ఆ అరుపులు వింటేనే ఓడలో వాళ్ళకు గుండెలు అవిసిపోయాయి. ఈదుకుంటూ వచ్చిన మర్కటాలు ఓడ మీదికి ఎక్కి వర్తకపు సరుకుల బేళ్ళను తడివి చూడసాగాయి. మర్కటాల సంఖ్య ఎంత హెచ్చుగా ఉన్నదంటే, వాటి జోలికి పోయే సాహసం చాలక వర్తకులందరూ వాటిని ఓడలో ఇష్టం వచ్చినట్టు చెయ్యనిచ్చారు.

ఆ మర్కటాలు చాలా వికారంగా ఉన్నాయి. వాటి శరీరాల నిండా బొచ్చు ఉన్నది. వాటి ముఖాలు నల్లగానూ, కళ్ళు ఆకుపచ్చగానూ ఉన్నాయి. అవి మూడు జానల ఎత్తే ఉన్నా, వాటి ముఖభంగిమలూ, అరుపులూ చాలా దారుణంగా ఉన్నాయి. అవి తమ భాషలో తిట్టుతూ ఏమేమిటో అన్నాయి. పళ్లు కొరికాయి. అవి ఏమంటున్నదీ అర్థంకాక ప్రయాణీకులు నిస్సహాయులుగా నిలబడిపోయారు.

కొన్ని మర్కటాలు తెరచాప స్తంభాల మీదికి ఎగబాకి, తాళ్ళు కొరికి తెంపి, తెరచాపలను కిందపడేశాయి. కొన్ని మర్కటాలు చుక్కాని పట్టుకుని తిప్పాయి. గాలివాలున ఓడ తీరానికి చేరింది. తరవాత అవి ఒక్కొక్క ప్రయాణీకుణ్ణీ పట్టుకుని తీరాన చేర్చి, అన్నీ కలిసి ఓడలో ఎక్కి, ఓడను నడుపుకుంటూ కనుచూపుమేర దాటిపోయాయి. అందరూ మర్కటాల దీవిలో చిక్కుకుపోయారు.

వాళ్ళు సముద్రతీరాన ఉండి చేసేది లేదు గనక, దీవి మీదికి బయలుదేరారు. అక్కడ పళ్ళచెట్లూ, వాగులూ ఉన్నాయి. వాళ్లు చెట్లనుంచి పళ్ళు కోసుకుని తిన్నారు. ఇంతలో వారికి దూరంగా ఒక ఎత్తయిన భవనం కనబడింది. వర్తకులందరూ దాని కేసి వెళ్ళారు.

ఆ భవనం నలుచదరంగానూ, చాలా ఎత్తుగానూ ఉన్నది. దాని చుట్టూ ఎత్తయిన ప్రహరీగోడ ఉన్నది. అయితే ఆ గోడలో ఉన్న ద్వారం తెరిచే ఉన్నది. ద్వారం వద్ద కావలావాళ్ళెవరూ లేరు.

భవనంలోపల విశాలమైన సావడి ఉన్నది. అందులో బ్రహ్మాండమైన వంట పాత్రలూ, మాంసం గుచ్చి కాల్చే ఇనప కాడలూ ఉన్నాయి. నేల మీద ఎముకల గుట్ట లున్నాయి. కొన్ని ఎముకలు ఎండిపోయీ, మరి కొన్ని పచ్చిగానూ ఉన్నాయి. దుర్గంధానికి ముక్కులు పగిలి పోతున్నాయి. అయినా అందరూ తెగడస్సి ఉండడం చేత ఆ సావట్లోనే నడుములు వాల్చి నిద్రపోయారు.

చీకటి పడే వేళకు ఉరుము లాంటి ధ్వని వినిపించేసరికి అందరూ ఉలిక్కిపడి మేలుకున్నారు. వారు చూస్తూండగానే పై కప్పు నుంచి ఒక భయంకరాకారుడు లోపలికి దిగాడు. వాడు నల్లగానూ, తాటి ప్రమాణంలోనూ ఉన్నాడు. వాడి కళ్ళు మండుతునిప్పుల్లాగా ఎర్రగా ఉన్నాయి. వాడి చెవులు భుజాల మీదికి వేళ్ళాడుతున్నాయి. వాడి చేతిగోళ్ళు పులిగోళ్ళలా ఉన్నాయి. వాణ్ణి చూసి అందరూ భయంతో కొయ్యబారిపోయారు.





ఆ రాక్షసుడు గోడవారనే ఉన్న బల్లమీద కూర్చుని మనుషులందరినీ కలయజూశాడు. తరవాత వాడు లేచివచ్చి సింద్‌బాద్‌ను మెడపట్టుకుని, పిల్లిని ఎత్తినట్టు ఎత్తి, అటూ ఇటూ తిప్పి చూశాడు. సింద్‌బాద్ వాడికి నచ్చినట్టు లేదు. అతను అసలే బక్కపలచనివాడు, ప్రయాణంలో మరింత చిక్కాడు. అందుచేత రాక్షసుడు అతన్ని కింద పారేసి, మిగిలినవాళ్ళను కూడా ఒకకొకర్నే పరీక్షించాడు.

చివరకు ఓడసరంగు వంతు వచ్చింది. అతను ఆజానుబాహుడూ, మంచి కండపుష్టి కలవాడూనూ. అందుచేత ఆ రాక్షసుడు అతన్ని విరిచి చంపి, ఇనపకాడకు గుచ్చి, నిశ్చింతగా కాల్చుకు తినేసి, ఆ బల్లమీదే పడుకుని, గుర్రుపెట్టి నిద్రపోయాడు.

ఇదంతా కళ్ళారా చూసిన మిగతా వాళ్ళకు పై ప్రాణాలు పైనే ఎగిరిపోయినట్టయింది. తెల్లవారి రాక్షసుడు బయటికి వెళ్ళిపోయిన దాకా వాళ్ళు కుక్కిన పేలలాగా ఉండిపోయి, ఆ తరవాత తమ దుస్థితి తలుచుకుని బావురుమని ఏడ్చారు.

వాళ్ళకు ఏం చెయ్యాలో తోచలేదు. అందరూ బయటికి వెళ్ళి, దాక్కునే చోటు కోసం దీవి అంతా గాలించారు. కాని అలాటి చోటేదీ లేదు. కొందరికి రాక్షసుడికి ఆహారం కావటం కన్న సముద్రంలో చావటం మేలనిపించింది. కాని మరి కొందరు, "చావు ఎలాగూ తప్పేటట్టు లేదు గనక, రాక్షసుణ్ణి చంపటానికి ప్రయత్నిద్దాం," అన్నారు.

ఈ ఆలోచన అందరికీ నచ్చింది. రాక్షసుణ్ణి చంపాక ఆ దీవి నుంచి పారిపోవాలంటే సాధనం ఒకటి అవసరం. అందుచేత వారంతా సముద్రతీరాన కొయ్యలతో పెద్ద తెప్ప ఒకటి తయారు చేసి, చీకటి పడే వేళకు భవనానికి తిరిగి వచ్చారు.

మామూలు వేళకు రాక్షసుడు ఇల్లు చేరుకున్నాడు. వాడు మరొక మనిషిని





చంపి, కాల్చుకుని తిని, ఒడ్డుమీద పడుకుని విశ్రాంతిగా నిద్రపోయారు. ఆ సమయంలో చావగా మిగిలినవాళ్ళు రెండు అనపకాడల చివరలను నిప్పులో ఎర్రగా కాల్చి, ఒక్కొక్క కాడనూ ముగ్గురు, నలుగురు చొప్పున పట్టుకుని తీసుకుపోయి రాక్షసుడి రెండు కళ్ళలోనూ గుచ్చారు. ఆ బాధకు రాక్షసుడు భవనం కూలిపోయేటంతగా అరిచాడు.

కళ్ళు పోయాయేగాని రాక్షసుడు చావలేదు. మనుషుల కోసం వాడు అంతటా తడివాడు గాని, ప్రయాణీకులు వాడికి అందకుండా తప్పించుకున్నారు. చివరకు వాడు తడుముకుంటూనే బయటికి వెళ్ళిపోయాడు.

వెంటనే మిగిలిన వాళ్ళంతా సముద్ర తీరానికి పరిగెత్తిపోయి, కిందటి రోజు తయారు చేసిన తెప్ప మీద ఎక్కి, దాన్ని సముద్రం మీదికి తోసుకుపోయారు.

కొద్ది సేపటికల్లా వారికి పెద్ద పెడబొబ్బ వినిపించింది. కళ్ళులేని రాక్షసుణ్ణి ఒక ఆడరాక్షసి నడిపించుకుంటూ రావటం వారికి కనిపించింది. ఇద్దరూ కలిసి సముద్రం ఒడ్డుకు వచ్చి తెప్ప మీదికి పెద్ద పెద్ద కొండ రాళ్ళు విసిరారు. వాటిలో కొన్ని గురిగా తగిలాయి. సింద్‌బాదూ, మరి ఇద్దరూ తప్ప మిగిలిన వారందరూ సముద్రంలో పడిపోయారు. చావగా బతికిన ముగ్గురూ తెప్పను రాళ్ళకు అందకుండా సముద్రం మీదికి తీసుకు పోగలిగారు.

వారా తెప్ప మీద రెండు పగళ్లూ, రెండు రాత్రులూ గాలికి కొట్టుకుపోయి మరొక దీవి చేరుకున్నారు. అప్పటికి వారు చాలా శోషిల్లి ఉన్నారు. వాళ్ళు ఆ దీవిలో సంచరించి, చెట్లపళ్ళు కోసుకు తిని, మంచినీరు తాగే సరికి సూర్యాస్తమయమయింది. ముగ్గురూ ఒక ఎత్తయిన చెట్టు ఎక్కి, ఆ రాత్రి దాని మీదనే నిద్రపోయారు.




వాళ్ళు తెల్లవారి నిద్రలేచి చూచేసరికి ఒక మహాసర్పం వాళ్ళున్న చెట్టు కేసి వస్తూ కనిపించింది. దాన్ని చూస్తూనే వాళ్ళకు దడపుట్టింది. అది కూడా వారిని చూడగానే, వారున్న ఎత్తుకు తలను లేపి, సింద్‌బాద్ వెంట ఉండిన ఇద్దరిలో ఒకణ్ణి పట్టి మింగేసి తన దారిన తాను వెళ్ళి పోయింది.

తరవాత సింద్‌బాదూ, అతని అను చరుడూ చెట్టు దిగి, పళ్ళు కోసుకు తిని, నీరుతాగి, రాత్రి గడపటానికి ఇంకా ఎత్త యిన చెట్టు కోసం ద్వీపమంతా వెతికి, దాని మీద ఎక్కి నిద్రపోయారు. కాని మళ్ళీ తెల్లవారే సరికి సర్పం వచ్చి, చెట్టు బోదెకు శరీరం చుట్టి వేస్తూ పైకి ఎక్కి, సింద్‌బాద్ వెంట ఉన్న ఒక్కణ్ణీ కూడా కబళించి వెళ్ళిపోయింది.

సింద్‌బాద్‌కు పుట్టిన దడ ఇంతా అంతా కాదు. అతను ఒంటరిగా మిగిలిపోయాడు. ఎంతో శ్రమపడి రాక్షసుడి బారి నుంచి తప్పించుకుంటే, మృత్యువు ఈ పాము రూపంలో మళ్ళీ ప్రత్యక్షమయింది. సర్పానికి ఆహారం ఆయేకన్న సముద్రంలో పడి ఆత్మహత్య చేసుకోవటం మేలనుకుని అతను దీనికి అర్ధంపడి సముద్ర తీరానికి పరిగెత్తాడు.

కాని తీరా అక్కడికి వెళ్ళేసరికి అతనికి చావు తప్పించుకునే ఉపాయం తోచింది. సముద్రం ఒడ్డున అనేక చెక్కలు పడి ఉన్నాయి. అతను ఆ కలప నంతా ఏరి తెచ్చి, నాలుగు పెద్ద చెక్కలు తనకు నాలుగు వైపులా పాతి, వాటి మధ్యన ఆ రాత్రి పడుకుని, తన పైన మరికొన్ని చెక్కలు పేర్చుకున్నాడు. ఈ ఎత్తు పారింది. మామూలువేళకు పాము వచ్చింది; అతన్ని చెక్కల సందు నుంచి బయటికి లాగాలని ఎన్నో విధాల ప్రయత్నించింది, సాధ్యంకాక వెళ్ళిపోయింది.

సర్వం వెళ్లిపోయినట్టు రూఢి అయినాక సింద్‌బాద్ చెక్కలను తోసేసి బయటికి వచ్చి, సముద్రతీరాన నిలబడి చూశాడు. దూరంగా ప్రయాణం చేస్తూ ఒక ఓడ కనిపించింది. అతను వెర్రిగా కేకలు పెట్టాడు; చేతులాడించాడు; ఒక చెట్టు కొమ్మకు తన తలపాగా కట్టి, గాలిలో ఆడించాడు. ఎలాగయితేనేం ఓడలో వాళ్ల దృష్టిని అతను ఆకర్షించగలిగాడు. ఓడవాళ్ళు మార్గం తప్పించి, ఓడను రేవుకు తెచ్చి, లంగరు దించి, సింద్‌బాద్‌ను ఎక్కించుకున్నారు.

అతను ఓడవాళ్లిచ్చిన మంచి దుస్తులు ధరించి, వాళ్ళు పెట్టిన భోజనం కడుపు నిండా తిని, బడలిక తీరేటట్టు సుఖంగా నిద్రపోయాడు. మృత్యుదేవత కళ్ళలోకి చూసిన కారణంగా అంతరించి పోయిన జీవచైతన్యం క్రమంగా తిరిగి కోలుకో సాగింది. గడిచిపోయిన కష్టాలు పీడకలలాగా తోచసాగాయి.



ప్రయాణం సుఖంగానే సాగింది. ఓడ సలాహితా అనే ద్వీపం చేరింది. ఓడలోని వర్తకులు క్రయవిక్రయాలు చెయ్యటానికి ద్వీపం మీదికి వెళ్ళారు. నిర్భాగ్యుడుగా ఓడ మీద నిలిచిపోయిన సింద్‌బాద్ దగ్గిరికి సరంగు వచ్చి, "చూడు, నాయనా! నువ్వు నిర్ధనుడివి, దిక్కులేని వాడివి. చాలా కష్టాలు పడి ఉన్నట్టు చెప్పావు. నా దగ్గిర కొంత సరుకు అనామతుగా ఉన్నది. అది మా ప్రయాణాలలో ఒక దీవి మీద దిగబడిపోయిన వర్తకుడిది. ఆ సరుకును తీసుకుపోయి అమ్మి డబ్బు తీసుకురా. ఆ డబ్బులో లాభం వంతు నువ్వు ఉంచుకుని, మిగతాది నా కిచ్చెయ్యి. నేను దాన్ని ఆ వర్తకుడి బంధువులకు చేర్చుతాను," అన్నాడు.

సింద్‌బాద్ అందుకు సంతోషంగా ఒప్పుకున్నాడు.

సరంగు ఒక గుమాస్తాను పిలిచి, "నావికుడు సింద్‌బాద్ బేళ్ళన్నీ చిట్టాలో రాసి

ఈ మనిషి పరం చెయ్యి. ఇతని పేరేమిటో అడిగి రామకో," అన్నాడు.

సింద్‌బాద్ ఉద్రేకంతో, "నేనే వాణికుడు సింద్‌బాద్‌ను!" అని గట్టిగా అరిచాడు.

అతను ఈసారి సరంగు కేసి పరీక్షగా చూసి, తన రెండవ యాత్రలో ఎక్కిన ఓడ సరంగు ఈ మనిషేనని గుర్తించాడు. ఇతనే తనని ఒక దీవిలో వదిలేసి ఓడను నడుపుకు వెళ్ళిపోయాడు.

సింద్‌బాద్ సరంగుతో తన రెండవ యాత్రలో గండభేరుండపక్షి సహాయంతో రత్నాల లోయలోకి వెళ్ళి, తిరిగి ప్రాణాలతో బయటపడిన అద్భుత సంఘటనలు చెబుతూండగా, సరుకు అమ్మి ఓడకు తిరిగి వచ్చిన ఒక వర్తకుడు సింద్‌బాద్ కేసి పరీక్షగా చూసి, "అరే, అల్లా! నా మాట ఎవరూ నమ్మలేదు. గండభేరుండపక్షి రత్నాల లోయలో నుంచి మనిషిని పైకి తీసుకు రావటం కళ్ళారా చూశానంటే, అన్నీ అబద్ధా లన్నారు. ఇడుగో ఆ మనిషి— నాకు వెలలేని రత్నా లిచ్చిన పుణ్యాత్ముడు!" అంటూ సింద్‌బాద్‌ను ఆలింగనం చేసుకున్నాడు.

సరంగు అనుమానాలన్నీ తీరిపోయాయి. అతను సింద్‌బాద్ చేతులు రెండూ పట్టుకుని, ప్రాణాలతో బయట పడినందుకు అతన్ని ఎంతగానో అభినందించాడు. తరవాత సింద్‌బాద్ తన సరుకులను విక్రయించి చాలా లాభం చేసుకున్నాడు.

ఓడ సలాహితా నుంచి సింధుదేశం వెళ్ళింది. అక్కడి సముద్రంలో ఆవుముక్కే, గాడిదముక్కే గల చేపలూ, ఎగిరే చేపలూ సింద్‌బాద్ చూశాడు. ప్రయాణం చాలా కాలం సాగినాక ఓడ బస్రా చేరింది. సింద్‌బాద్ బస్రా నుండి బాగ్దాద్ చేరుకుని, తన వారినందరినీ కలుసుకుని, పేదసాదలకు దానధర్మాలు చేసి, తిరిగి సుఖజీవనం గడపసాగాడు.





# సింద్‌బాద్ అద్భుత యాత్రలు

కష్టాలు సంప్రాప్తమైనప్పుడు అవి తీరిన దాకా ఆరాటపడటమూ, తీరిపోయాక వాటిని తలుచుకుని ఆనందించటమూ మానవ స్వభావం. కష్టాలు సంభవించిన సమయంలో కలిగిన భయమూ, ఆందోళనా, వెనక్కు తిరిగి చూసుకుంటే అర్థం లేనివిగా కనిపిస్తాయి.

సింద్‌బాద్‌కు అలాగే అనిపించింది. అతను మూడుసార్లు సముద్రాల మీద వెళ్లి యమయాతనలు పడ్డాడు. అయినా, తీరి కూర్చుని సమస్త సుఖాలూ అనుభవించటంలో జీవితం లేనే లేదనీ, ప్రపంచం తిరిగి, కొత్త కొత్త అనుభవాలు సంపాదించటమే జన్మ సాఫల్యమనీ అతనికి తోచసాగింది. ఇంకా డబ్బు సంపాదించటం కూడా పురుష లక్షణమే ననిపించింది.

ఒక్క ముక్కలో చెప్పాలంటే అతని కాళ్లు మళ్ళీ దురదపెట్టాయి. అందుచేత అతను దైవప్రేరితుడి లాగా, బంధుమిత్రులనూ, సమస్త సుఖాలనూ వదిలేసి పూర్వం కన్న విలువగల వర్తకపు సరుకులు కొని, వాటితో బస్రా చేరాడు. అక్కడ మరి కొందరు బస్రా వర్తకులతో బాటు ఒక పెద్ద ఓడలో ఎక్కి సముద్రం మీద ప్రయాణమైనాడు. అది మంచి వేగం గల ఓడ.

ఓడ చాలా రేవులు చూసింది. అది నిలిచిన చోటనల్లా వర్తకం చురుకుగానూ, లాభసాటిగానూ సాగింది. అయితే ఒకనాడు సరంగు నట్టనడి సముద్రంలో లంగరు దింపించి, 'మనకు పెద్ద ఆపదే వచ్చి పడింది," అన్నాడు.

అతనా మాట అన్న సమయంలో బ్రహ్మాండమైన ఉప్పెనగాలి వీచింది. దాని ప్రమాణాన సముద్ర కెరటాలు లేచి, అనేక వేల ఏనుగుల బలంతో ఓడను బాదనారంభించాయి. ఆ తాకిడికి తట్టుకోలేక ఓడ,

నాలుగవ యాత్ర



వర్తకులతోనూ, వారి సరుకులతోనూ సహా సముద్రంలో మునిగిపోయింది. సింద్‌బాదూ, మరి కొందరు వర్తకులూ అదృష్టవశాన ఒక చెక్కల తెప్పును పట్టుకుని, దాని సహాయంతో ప్రాణాలు కాపాడుకున్నారు. వారిని కెరటాలు ఒక ఫూటల్లా బంతి ఆడినట్టు ఆడించాయి. చివరకు గాలి వారిని ఏదో తీరానికి తెచ్చి పారేసింది. ఉప్పైన దెబ్బకు ప్రాణాలు మూరువంతులు చచ్చి ఉండ టాన, ఎట్లా పడినవాళ్ళు అట్లాగే ఇసుకలో నిద్రపోయారు.

ఆ రాత్రి గడిచి తెల్లవారేసరికి వాళ్ళు కొంచెం తేరుకున్నారు. అందుచేత వాళ్ళు లేచి, తీరం నుంచి దూరంగా భూప్రాంతా నికి బయలుదేరారు. కొంత దూరం వెళ్లాక అల్లంత దూరాన వారి కొక భవనం కనిపిం చింది. అంతలోనే ఆ భవన ద్వారంలో నుంచి, కారునలుపు మనుషులు, బట్టలకు మారుగా చర్మాలు ధరించినవాళ్ళు, పరిగెత్తు కుంటూ వచ్చి వర్తకులను కలుసుకుని, మాటా పలుకూ లేకుండా వారిని భవనం లోకి తీసుకుపోయారు.

ఆ భవనంలో ఒక విశాలమైన సావడి ఉన్నది. అందులో ఎత్తయిన సింహాసనం మీద ఒక రాజు కూర్చుని ఉన్నాడు. సింద్ బాద్‌నూ, అతని అనుచరులనూ కూర్చోమని ఆ రాజు సైగ చేశాడు. అందరూ కూర్చు న్నాక నల్లటివాళ్లు కంచాలలో భోజనాలు తెచ్చి, అందరి ముందూ ఉంచారు. ఆ భోజనంలో ఉన్న పదార్థా లేమిటో కూడా సింద్‌బాద్‌కు అంతుపట్టలేదు. వాటిని చూస్తుంటే అతనికి నోట పెట్టుకో బుద్ధి కాలేదు. కాని మిగిలినవాళ్లు ఆకలి కొద్దీ ముందూ వెనకా ఆలోచించకుండా తమ ముందున్న ఆహారాన్ని ఆవురావురని తినే వారు. వాళ్ళా ఆహారాన్ని తినే పద్ధతి చూస్తున్నకొద్దీ సింద్‌బాదుకు పశువులు మేత మేయటం జ్ఞాపకం వచ్చింది.

సింద్‌బాద్ అనుచరులు భోజనం చేస్తూం డగానే నల్లవాళ్ళు జాడీలతో ఏదో లేపనం తెచ్చి, తినేవాళ్ళ శరీరాలకు పూయసాగారు. ఆలేపనం మహిమ ఏమిటోగాని ఒక్కొక్కడి పొట్టా చూస్తుండగానే ఉబ్బుకు రాసాగింది. పొట్టలు పెరిగే కొద్దీ వాళ్ళ ఆకలి పెరుగు తున్నట్టు కనబడింది.

సింద్‌బాద్ ఆ భోజనాన్ని తాకలేకపోవటం మేలయింది. నల్లవాళ్ళు ఆతని శరీరానికి కూడా లేపనం పూయవచ్చారు, కాని అతను ఒప్పుకోలేదు. ఈ నల్లవాళ్ళు నరభక్షకులనీ, తన అనుచరులను కొవ్వెక్కే లాగా తిని పించి, తరవాత కోసుకు తింటారనీ ఆతనికి త్వరలోనే తెలియవచ్చింది. నల్లవాళ్ళు పచ్చిమనుషులను పీక్కు తింటారు; వాళ్ళ రాజు మాత్రం రోజుకొక మనిషిని కాల్చుకు తింటాడు!

తన అనుచరుల మీద అతను ఆశలు వదులుకున్నాడు. పొట్టలు పెరిగేకొద్దీ వారి మెదడు తరిగిపోతున్నట్టు స్పష్టమయింది. చివరకు నల్లవాళ్ళు వాళ్ళను మేపటా నికి పచ్చిక మైదానాల మీదికి తోలుకు పోవటం కూడా సింద్‌బాద్ చూశాడు.

తన గతి ఏమిటన్నదే ఆతనికి అర్థం కాలేదు. అసలే బక్కమనిషి, ఆకలితోనూ, భయంతోనూ మరింత చిక్కి, ఎముకల





గూడు లాగా అతను తయారయాడు. ఆ నల్ల వాళ్ళు అతన్ని గురించి ఏ మాత్రమూ పట్టించుకోలేదు. అందుచేత అతను ఒక నాడు ఆ భవనం దాటి, దీవికి అడ్డంపడి నడవసాగాడు. తన అనుచరులను తోలుకు పోతూ నల్లవాళ్ళు ఎదురయితే అతను ఒక చెట్టు చాటుకు తప్పుకున్నాడు.

సింద్‌బాద్ దారిలో దొరికిన దుంపలూ అవీ తింటూ ఆరు రోజులపాటు నడిచి, చివరకు మానవులుండే చోట వచ్చి పడ్డాడు. ఆ ప్రాంతంలోనే దీవి అవతలి తీరం ఉన్నది. అక్కడి మనుషులు సింద్‌బాద్ మాట్లాడే భాషే మాట్లాడుతున్నారు. వారి భాష వినగానే అతనికి ప్రాణం లేచి వచ్చినట్టయింది. అతను వారితో తన కష్టాలన్నీ చెప్పుకున్నాడు. వారు అతనికి భోజనం పెట్టారు. అతను విశ్రాంతి తీసుకున్న అనంతరం వాళ్ళు అతన్ని పడవ మీద, తమ రాజుగారుండే మరొక దీవికి తీసుకుపోయారు.

రాజధానీ నగరం నాగరికంగా ఉన్నది. జనసంఖ్య జాస్తి. వీధులు విశాలంగానూ, శుభ్రంగానూ ఉన్నాయి. జనం జీనుల్లేని గుర్రాల మీద స్వారీ అయి వీధుల వెంట వెళుతున్నారు. అది చూసిన సింద్‌బాద్ రాజుగారిని దర్శనం చేసుకుంటూనే, "మీ పౌరులు జీనులు లేకుండా గుర్రాల మీద స్వారీ చేస్తారెందుకని?" అని అడిగాడు.

"జీనులంటే ఏమిటి? వాటిని మే మెరగమే!" అన్నాడు రాజు.

"తమ అనుమతి అయితే రెండు రోజుల్లోపల జీను ఒకటి తయారు చేసి చూపుతాను. దానివల్ల ఎంత విలువున్నదీ తమకే తెలుస్తుంది," అన్నాడు సింద్‌బాద్.

రాజుగారి అనుమతి పొంది, ఒక వడ్రంగి చేత అతను కొయ్య జీను తయారు చేయించాడు. దాని మీద అమర్చటానికి ఊకలు కూరిన మెత్త తయారు చేయించి, దానికి తోలు తొడుగూ, జలతారు అంచులూ,

రంగుల కుచ్చులలా అమర్చాడు. తరవాత ఒక కమ్మరి చేత కళ్ళెం తగిలించే ఇనప ముక్కా, కాళ్ళు పెట్టుకునే రికాబులా చేయించాడు.

తరవాత సింద్‌బాద్ గుర్రాలుండే చోటికి వెళ్ళి, ఒక మంచి గుర్రాన్ని ఏరి, దానికి కళ్ళెమూ, జీనూ అమర్చాడు; దాని మెడకు నీలం కుచ్చులు పెట్టి, దాన్ని తీసుకుపోయి రాజుగారి ముందు పెట్టాడు. రాజుగారు ఆ గుర్రాన్ని ఎక్కి స్వారీ చేసి, జీను వల్లా, కళ్ళాల వల్లా కలిగే సదుపాయం గ్రహించి, సింద్‌బాద్‌కు ఎంతో ధనమూ, కానుకలూ బహూకరించాడు.

రాజుగారి అనంతరం మంత్రిగారు కూడా తన గుర్రానికి సింద్‌బాద్ చేత జీను ఏర్పాటు చేయించుకున్నాడు. అది మొదలు నగరంలో ఉన్న గొప్పగొప్ప వాళ్ళంతా తమ గుర్రాలకు జీనులు ఏర్పాటు చేయించుకుని, సింద్‌బాద్‌కు అంతులేని కానుక లిచ్చి, అతన్ని గొప్ప ధనికుణ్ణి చేశారు.

రాజుగారికీ, సింద్‌బాద్‌కూ గొప్ప స్నేహం కుదిరింది. ఆ స్నేహాన్ని పురస్కరించుకుని రాజుగారు సింద్‌బాద్‌కు ఒక సంబంధం చూశాడు. అతన్ని పెళ్ళిచేసి కట్టి పడేస్తే, అక్కడే ఉండిపోతాడని రాజుగారి ఉద్దేశం. సింద్‌బాద్‌కు తల తిరిగినట్టయింది; కాని





రాజుగారి మాటకు ఎదురు చెప్పలేక సరే నన్నాడు. వధువు చాలా చక్కనిదీ, సంపన్నురాలు కూడానూ. ఈ దంపతులు ఉండటానికి ఒక దివ్యమైన భవనమూ, వారికి సేవ చెయ్యటానికి దాసదాసీ జనాన్నీ ఏర్పాటు చేశాడు రాజు.

సింద్‌బాద్ తన భార్యతో చాలా అన్యోన్యంగా అనేక మాసాలపాటు కాపరం చేశాడు. తాను బాగ్దాదుకు పోయే అవకాశం చిక్కినప్పుడు ఆమెను తన వెంట తీసుకు పోదామని కూడా అతను అనుకున్నాడు.

ఒకనాడు సింద్‌బాద్ పొరుగున ఉన్న పెద్దమనిషి భార్య చనిపోయింది. సింద్‌బాద్ అతన్ని పరామర్శించటానికి వెళ్ళి, "విచారించకండి. ఈ సారి మీకు ఇంతకన్న కూడా యోగ్యురాలైన భార్య దొరక వచ్చు," అన్నాడు.

"కొద్ది గంటలలో చచ్చిపోయే వాడికి ఇంకో భార్య ఏమిటి?" అన్నాడా మనిషి.

ఆ మాట అప్పుడు సింద్‌బాద్‌కు ఏమీ అర్థం కాలేదు. కాని త్వరలోనే అతను నిజం తెలుసుకున్నాడు. భార్యాభర్తలలో ఎవరు పోయినా అద్దరినీ కలిపి పూడ్చెయ్యటం అక్కడి ఆచారం. అది తెలిసి సింద్‌బాద్ చాలా చీదరించుకున్నాడు. అతను చూస్తూండగానే పొరుగింటి వాడు తన భార్య శవం వెనకగా శ్మశానానికి వెళ్ళాడు. నదీ తీరాన ఒక కొండ మీద చాలా లోతైన బావి ఉన్నది. శవంతోబాటు, చనిపోయిన స్త్రీ భర్తను కూడా ఆ బావిలోకి దింపి, బావి మీద బండరాయిని కప్పేశారు.

ఈ అమానుషమైన ఆచారం పరదేశీయులకు కూడా వర్తిస్తుందా అని సింద్‌బాద్ రాజు నడిగితే, వర్తిస్తుందని ఆయన చెప్పాడు. సింద్‌బాద్‌కు కడుపులో చెయ్యి పెట్టి కెలికినట్టయింది. తన భార్యకన్న తానే ముందు చస్తానని అతను తనకు తాను ధైర్యం చెప్పుకున్నాడు.





కాని అలా జరగలేదు. కొద్ది రోజులకే సింద్‌బాద్ భార్యకు జబ్బు చేసి, మంచాన పడి, చివరకు మరణించింది. అతని నెత్తిన పిడుగుపడ్డట్టయింది. రాజుగారు తన విషయంలో ఆచారాన్ని దాటి వేస్తారన్న ఆశ కూడా పోయింది — రాజుగారు స్వయంగా వచ్చి, చచ్చిపోబోతున్నందుకు అతని పట్ల సానుభూతి సంతాపాలు తెలిపి, ఎంతగానో విచారించారు.

సింద్‌బాద్ భార్య శవాన్ని నగలతో అలంకరించి, పేటికలో పెట్టి కొండ వద్దకు చేర్చారు. శవం వెనక సింద్‌బాద్‌తో బాటు రాజుగారూ నడిచారు. తనకు తన దేశంలో భార్యా, బిడ్డలూ ఉన్నారనీ, వాళ్ళు తన కోసం ఎదురు చూస్తూ ఉంటారనీ సింద్‌బాద్ మొత్తుకున్నాడు. కాని అది అరణ్య రోదనమయింది.

ముందు శవపేటికను బావిలో దించారు. తరవాత అతని చంకల కిందుగా తాళ్లుకట్టి, ఆ తాళ్ళకే ఒక నీరు గల కూజా, ఏడు రొట్టెలూ కట్టి, సింద్‌బాదును కూడా బావిలోకి దించారు. అతను తాళ్ళు ఊడదీసినాక పైనున్న వాళ్ళు వాటిని పైకిలాక్కుని, బావి మీద రాయి మూసి, తమ దారిన తాము వెళ్ళిపోయారు.

బావి దిగువన చాలా విశాలమైన గుహలాగా ఉన్నది. అంతో ఇంతో వెలుతురు లోపలికి వస్తున్నది. సింద్‌బాద్ తాను ఇంటి నుంచి బయలుదేరినందుకూ, సముద్రంలో మునిగి చావనందుకూ విచారించాడు.

అతన్ని ఆకలీ, దప్పీ బాధించసాగాయి. కాని సాధ్యమైనంత కాలం బతికి ఉండాలనే ఆశతో అతను నీటినీ రొట్టెనూ చాలా పొదుపుగా ఖర్చుచేశాడు. రాత్రివేళ పడుకునేటందుకు చోటు ఏర్పాటుచేసుకున్నాడు. క్రమంగా నీరూ, రొట్టెలూ అయిపోయాయి. ఇక చావు కోసం ఎదురుచూడటం తప్ప అతను చేయగలిగినది ఏమీ లేదు.





ఈ స్థితిలో ఒక చిత్రం జరిగింది. అతను నిద్రపోతూండగా ఏదో శబ్దానికి మెలకువ వచ్చింది. నిద్రలేచాక శ్వాస వినిపించింది. తరవాత ఏదో జంతువు పారిపోతున్న చప్పుడయింది. అతను సాహసించి ఆ పారిపోయే జంతువును తరుముతూ, ఎగుడు దిగుడు నేలమీద పడుతూ లేస్తూ పరిగెత్తాడు. కొంత దూరం వెళ్ళాక అతని కంటికి నక్షత్రం కనిపించింది. అదొక బిలం. శవాలను తినే నక్కలో, తోడేళ్లో ఆ బిలం గుండా వస్తున్నాయన్నమాట.

సింద్‌బాద్ ఆ బిలంలో నుంచి దూరి అవతలికి వెళ్ళేసరికి, పైన ఆకాశమూ వెలిగిపోతున్న నక్షత్రాలూ కనబడ్డాయి. అతను మోకరించి భగవంతుడికి ధన్యవాదాలు తెలుపుకున్నాడు. తరవాత మళ్ళీ గుహలోకి వెళ్ళి, శవాలకుండిన నగలన్నీ ఒలిచి మూట కట్టుకుని తిరిగి వచ్చాడు. కొండ అవతలి పక్క సముద్రం ఉన్నది. ఆ సముద్రతీరాన అతను మకాం పెట్టి, ఏదన్నా ఓడ కనిపిస్తుందేమో నని ఎదురు చూడసాగాడు.

కొద్దిరోజులకు అటుగా ఒక ఓడ రానే వచ్చింది. ఓడలోవాళ్ళు అతన్ని గమనించి సమీపంగా వచ్చారు. అతను నగలమూటతో సహా ఓడలోకి ఎక్కి, తాను ఓడ పగిలిన ప్రయాణీకుణ్ణని సరంగుతో చెప్పాడు. సరంగును మంచి చేసుకుందామని అతను తన నగలమూటలో నుంచి మంచివి ఏరి ఇవ్వబోయాడు గాని, సరంగు తీసుకోలేదు; "అపాయం నుంచి రక్షించినవాళ్ళ దగ్గిర నేను కిపు పుచ్చుకోను," అన్నాడు. అతని ధర్మబుద్ధికి సింద్‌బాద్ చాలా సంతోషించాడు.

కాలక్రమాన ఓడ బస్రా చేరింది. సింద్‌బాద్ ఆ నగరంలో కొద్ది రోజులుండి, నదీ ప్రయాణం చేసి బాగ్దాదు చేరాడు. అతన్నీ, అతను తెచ్చిన నగలనూ చూసి అతని బంధువులు పరమానందభరితులయారు.





# సింద్‌బాద్ అద్భుతయాత్రలు

నాలుగుసార్లు సముద్రయానాలు చేసి నానా కష్టాలూ పడినా కూడా, సింద్‌బాద్ ప్రతి సారీ అంతులేని ధనం సంపాదించాడు. ఎంతో అనుభవం గడించాడు. ఎంతో కష్టపడి సంపాదించిన అనుభవం కావటంచేత అది అతనికి మరింత విలువైనదిగా తోచింది. అందుచేత, ఇంటి వద్ద కూర్చుని ఎన్ని వైభోగాలు అనుభవించినా అతని బుద్ధి కాలక్రమాన మళ్ళీ విదేశయాత్రల మీదికే మళ్ళింది.

అతను అయిదోసారి సముద్రయానానికి సన్నాహం చేశాడు. ఇతర దేశాలలో మంచి లాభానికి అమ్ముడయ్యే సరుకులు కొని, బేళ్లు కట్టించి, అమ్మకానికి వచ్చిన ఒక ఓడను చూసి ముచ్చటపడి, దాన్ని ఏకంగా కొనేసి, దాన్ని నడపటానికి అనుభవంగల సరంగును, కళాసులనూ జీతానికి కుదుర్చుకుని, తన ఇంటి బానిసలను వెంట పెట్టుకుని ప్రయాణానికి సిద్ధమయాడు. ఈ సంగతి తెలిసి మరికొందరు వర్తకులు, ప్రయాణపు ఖర్చులు ముందుగానే అతని కిచ్చి, అతని ఓడలో బయలుదేరారు. సింద్‌బాద్ ఈసారి తన సొంత ఓడలో ప్రయాణం కావటమే గాక, సముద్రయానంలో లోగడ చాలా అనుభవం గడించి ఉండటంచేత తాను సరంగుకు సలహా లివ్వదగిన స్థితిలో కూడా ఉన్నాడు.

బస్రా దాటినాక ప్రయాణం చాలా సుఖప్రదంగా సాగింది. గాలి అనుకూలంగా ఉన్నది. సముద్రం ప్రశాంతంగా ఉన్నది. ఓడ ఆగిన ప్రతి రేవులోనూ క్రయవిక్రయాలు సవ్యంగా జరిగాయి.

ఒకసారి ఓడ ఒక నిర్జనమైన దీవి చేరింది. అక్కడ లంగరు దించి, వర్తకులు దీవి చూడబోయారు. వారికి దీవి మీద ఒక గండభేరుండపక్షి గుడ్డు కనిపించింది.



అదేమిటో తెలియక వాళ్ళు దానిపైన రాళ్లు వేశారు. గుడ్డు చిట్లి, లోపల ఉన్న పక్షి పిల్ల కాలు బయటికి వచ్చింది. వర్తకులు ఆ పిల్లను బయటికిలాగి, దాన్ని ముక్కలుగా కోసి పంచుకుని, ఓడకు తిరిగి వచ్చారు.

వాళ్ళు తాము చేసిన పని చెప్పగానే సింద్‌బాద్ చాలా కంగారు పడ్డాడు. "మీరు చాలా ప్రమాదమైన పని చేశారు. గండభేరుండ దంపతులకు జరిగినది తెలియగానే మనని తరిమి, హతమారుస్తాయి! మనం సాధ్యమైనంత శీఘ్రంగా పారిపోవటం తప్ప చేసేది లేదు," అన్నాడతను వర్తకులతో. అతను ఆ క్షణంలోనే తెర



చాపలు ఎత్తించి, ఓడను సముద్రం మీదికి నడిపించాడు.

వర్తకులు తాము తెచ్చుకున్న పక్షి మాంసం వండించుకున్నారు. కాని వాళ్ళు దాన్ని తినేలోపల ఆకాశాన సూర్యుడికి రెండు మేఘాలు అడ్డు తగిలినట్టయింది. అవి గండభేరుండ పక్షులే. వాటి రెక్కల చప్పుడూ, అరుపులూ మేఘగర్జన లాగా వినిపించాయి. అవి సింద్‌బాద్ నౌకకు ఎగువగా ఎగరసాగాయి. వాటి కాళ్ళ గోళ్ళ మధ్య రెండు బ్రహ్మాండమైన కొండరాళ్ళు, నౌక కన్న కూడా పెద్దవి, ఉన్నాయి.

చూస్తుండగానే ఒక పక్షి తన కాళ్ళ మధ్య ఉన్న రాతిని సూటిగా ఓడ మీదికి వదిలింది. అయితే సరంగు చుక్కాని పక్కకు తిప్పి, ఉపాయంగా ఓడను కాపాడాడు. ఆ రాయి ఓడ పక్కగా సముద్రంలో పడింది. రాయిపాటుకు నీటిలో గొయ్యి ఏర్పడి. క్షణంపాటు అడుగు కనిపించింది. అప్పుడు లేచిన అలలకు ఓడ బంతి ఆడినట్టు ఆడిపోయింది.

ఇంతలో రెండో పక్షి తన కాళ్ళ మధ్య ఉన్న రాతిని విడిచింది. దాని దెబ్బకు ఓడలో ఒక సగం నుగ్గు నుగ్గు అయిపోయింది. కొందరు రాతిపాటుకే చచ్చారు.



మిగిలిన వాళ్ళు సముద్రంపాల పడ్డారు. సింద్‌బాద్ తన ప్రాణం కాపాడుకోవటానికి విశ్వప్రయత్నం చేశాడు. అతనికొక పలక దొరికింది. దాని సహాయంతో తేలుతూ, కాళ్ళను తెడ్లలాగా ఉపయోగిస్తూ ఒక దీవిని ఎలాగో చేరుకోగలిగాడు. అక్కడ ఇసుకలో కొంతసేపు పడుకుని, సేదతీరాక దీవిని పరిశీలించటానికి బయలుదేరాడు.

ఆ దీవి అతనికి భూలోకస్వర్గంలాగా కనబడింది. అంతటా పళ్ళచెట్లూ, వాటి మీద పచ్చగా పండిన పళ్ళూ ఉన్నాయి. చెట్ల మీద రంగురంగుల పక్షులు కలకల నినాదాలు చేస్తున్నాయి. కింద ఉన్న నేల రకరకాల పూలమొక్కలతో రంగుల తివాసీ లాగున్నది. ఆ పూలు సువాసనలు వెదజల్లుతున్నాయి. సింద్‌బాద్ చెట్ల మీది పళ్ళు కోసుకు తిని, నిర్మలమైన సెలయేటి నీరు తాగి, పుష్పాల తివాసీ పైన పడుకుని సాయంకాలం దాకా నిద్రపోయాడు.

అతను నిద్ర లేచేసరికి చీకటిపడబోతున్నది. అది నిర్జనమైన దీవి కావటంచేత అతనికి చీకటి భయం పుట్టుకొచ్చింది. ఆ రాత్రి ఎలాగో కలతనిద్రపోయాడు గాని, భయంకరమైన కలలు కన్నాడు. ఎలాగో రాత్రి గడిచి తెల్లవారింది. అతను తిరిగి దీవి మీద తిరగటం మొదలుపెట్టాడు.







కొంతసేపయాక అతనికి తలవని తలంపుగా ఒక మనిషి కనిపించాడు. ఒకచోట ఒక మడుగున్నది. అందులోకి ఒక జలధార పడుతున్నది. మడుగు అంచున ఆ మనిషి కూర్చుని ఉన్నాడు. ఆ మనిషి ముసలివాడు. ఆకులతో దుప్పటిలాంటిది తయారుచేసుకుని, దాన్ని తన శరీరం మీద కప్పుకుని ఉన్నాడు. తనలాగే ఆ మనిషి కూడా పగిలిన ఓడలో నుంచి ప్రాణాలతో వచ్చిచేరిన నావికుడై ఉంటాడని సింద్‌బాద్ అనుకున్నాడు.

అతను ఆ ముసలివాణ్ణి సమీపించి, "ఏం, బాబూ? నువ్విక్కడికి ఎలా చేరావు?" అని అడిగాడు. ముసలివాడు విచారంగా తల అడ్డంగా తిప్పి, కొన్ని సంజ్ఞలు చేశాడు. తనకు ప్రవాహం దాటాలని ఉన్నదనీ, దాని అవతలి గట్టునే ఉన్న చెట్లపళ్ళు తినాలని ఉన్నదనీ, తనను ప్రవాహం దాటించమనీ ముసలివాడు సంజ్ఞలు చేశాడు.

సింద్‌బాద్ ఆ ముసలివాడికి సహాయం చేద్దామనుకుని, వంగి అతణ్ణి తన భుజాల మీదికి ఎక్కించుకున్నాడు. ముసలివాడు తన తొడలతో సింద్‌బాద్ కంఠాన్ని బలంగా పట్టుకుని, కాళ్ళు మెలికవేసి సింద్‌బాద్ రొమ్ముకు అదిమిపెట్టి, సింద్‌బాద్ తలను తన చేతులతో పట్టుకున్నాడు. సింద్‌బాద్ ప్రవాహం దాటి, కొంచెం వంగి, "బాబూ, నింపాదిగా దిగు," అన్నాడు.

కాని ముసలివాడు దిగే ప్రయత్నం చెయ్యక, తన తొడలతో సింద్‌బాద్ కంఠాన్ని మరింత దృఢంగా నొక్కిపట్టి, అతని భుజాలమీద మరింత బలంగా కూర్చున్నాడు. సింద్‌బాద్ ఆ ముసలాడి కాళ్ళకేసి చూసి కంపరమెత్తిపోయాడు. ఆ కాళ్లు బొచ్చుతో ఎనుబోతు కాళ్ళ లాగున్నాయి. ముసలివాణ్ణి కింద పడెయ్యాలని సింద్‌బాద్ ప్రయత్నించాడు. ఆ ప్రయత్నం ఫలించక



పోగా ముసలాడు సింద్‌బాద్ కంఠాన్ని మరింత గట్టిగా నొక్కి, ఊపిరాడకుండా చేశాడు. సింద్‌బాద్ కళ్ళు చీకటి అయిపోయాయి. అతను స్పృహ తప్పి కింద పడిపోయాడు.

అతనికి తిరిగి స్పృహ వచ్చేసరికి ముసలాడింకా అతని భుజాల మీదే ఉన్నాడు. అయితే అప్పుడతనికి ఊపిరి ఆడుతున్నది.

సింద్‌బాద్‌కు స్పృహ వచ్చినట్టు తెలిసి ముసలాడు కాళ్ళతో అతని గుండెల్లో తన్నాడు. సింద్‌బాద్ లేచి నిలబడి, ముసలాడికి కావలసినట్టుగా నడవసాగాడు. వాడు ఆగమంటే ఆగాలి, నడవమంటే నడవాలి. వాడికి కావలసినట్టు చెయ్యకపోతే కాలి తన్నులు తినాలి. అలా వచ్చింది సింద్‌బాద్ గతి. అతను రాత్రి పూట నిద్రపోయినప్పుడు కూడా ముసలాడు అతని భుజాల మీది నుంచి దిగలేదు.

ముసలాడి వల్ల కలిగిన శరీరబాధా, అవమానమూ సింద్‌బాద్ తన జీవితంలో లోగడ ఎన్నడూ ఎరగడు.

అతను ముసలాణ్ణి చాలా వారాలపాటు మోశాడు. తరవాత ఒకనాడు అతనికి ఒక చోట పెద్ద పెద్ద సొరకాయ ఉన్న లత కనబడింది. అందులో ఎండ బారుతున్న సొర





కాయగా మూసి కోసి, దాన్ని డొల్ల చేసి, అందులో ద్రాక్షపళ్ళ రసం నింపి, బిరడా బిగించి, ఎండ పడే చోట పెట్టాడు. కొన్ని రోజుల అనంతరం ద్రాక్షరసం పులిసి సారా అయింది. తరవాత అవకాశం దొరికినప్పుడల్లా ఆ సొరకాయ బుర్రలో ఉన్న సారాను అతను కొంచెం కొంచెం తాగుతూ వచ్చాడు. దానితో అతనికి బలమూ, ఉత్సాహమూ పెరిగాయి. తనను ఇంత కాలంగా మోస్తున్న మనిషి అకస్మాత్తుగా, గెంతటమూ, పాడటమూ, నృత్యం చెయ్యటమూ ముసలాడు గమనించి, సొరబుర్రను తనకు కూడా ఇయ్యమని సంజ్ఞ చేశాడు. వాడంటే భయం కొద్ది సింద్‌బాద్ వాడికి సారా ఇచ్చాడు. ముసలాడు ముందు కొంచెం రుచి చూసి, వెంటనే బుర్ర అంతా ఖాళీ చేసి ఖాళీ బుర్రను దూరంగా గిరవాటు వేశాడు. కొద్ది సేపటికల్లా వాడి నిషా మైకంగా మారింది.

ముసలాడి కాళ్ళ పట్టు మెడమీద సడలటం గమనించి, సింద్‌బాద్ వాడి కాళ్ళు మెలిక విప్పి, ఒక్క తోపుతో వాణ్ణి కింద పడేశాడు. ముసలాడు పడిన చోటనే ఉండిపోయాడు. సింద్‌బాద్ పెద్ద రాయి ఏరుకొచ్చి, ముసలాడి తల చితకగొట్టి, వాణ్ణి చంపేశాడు.

ఈ విధంగా ముసలాడి పీడ వదిలించుకుని, సింద్‌బాద్ సముద్ర తీరానికి పరిగెత్తాడు. అతని కోసం వచ్చినట్టుగా తీరాన లంగరు దించిన ఒక ఓడా, కొందరు నావికులూ ఉన్నారు. వారు నీటి కోసమూ, పళ్ళ కోసమూ ఆ దీవి చేరారట.

సింద్‌బాద్ ముసలాణ్ణి గురించి చెబితే వాళ్ళు ఆశ్చర్యపోయి, "ఆ ముసలాడి నుంచి తప్పించుకున్నావా? అలా తప్పించుకున్నవాడివి నువ్వొక్కడివే అయి ఉంటావు. వాడు ఎందరినో చంపాడు," అన్నారు.

వాళ్ళు సింద్‌బాద్‌ను తమ ఓడలోకి ఎక్కించుకున్నారు. అతనికి వాళ్ళు బట్టలు



కూడా ఉన్నారు. ఓడ అక్కడి నుంచి బయలుదేరి చాలా రోజుల అనంతరం ఒక నగరంలో రేవు చేరింది. అది చాలా పెద్ద నగరంట. నగరం చుట్టూ ఉండే చెట్లమీద కొండముచ్చులు అసంఖ్యాకంగా ఉండటం చేత ఆ నగరానికి కొండముచ్చుల నగరం అని పేరు వచ్చిందనీ, ఆ నగరానికి దేశ దేశాల వర్తకులు వస్తూంటారనీ సింద్‌బాద్ తెలుసుకున్నారు.

సింద్‌బాద్ ఒక వర్తకుడితో స్నేహం కలిపి, ఆ వర్తకుడి వెంట నగరంలోకి బయలుదేరాడు. ఆ వర్తకుడు ఒక సంచీ నిండా గులకరాళ్ళు పోసి సింద్‌బాద్ కిచ్చి, "చాలామంది నగరద్వారం దాటి సమీపంలో ఉండే లోయకు పోతూ నీకు కనిపిస్తారు. నువ్వు వారితో వెళ్లి, వాళ్ళేం చేస్తే నువ్వూ అదే చెయ్యి. అందువల్ల నీకు లాభిస్తుంది," అని చెప్పాడు.

సింద్‌బాద్ గులకరాళ్ళ సంచీ తీసుకుని నగరద్వారం వద్దకు వెళ్ళి, మందలు మందలుగా బయటికి వచ్చే జనాన్ని చూసి, వారివెంట నడిచాడు. కొంతదూరం నడవగా ఒక లోతైన లోయ వచ్చింది. అందులో చాలా ఎత్తయిన చెట్లున్నాయి. మనుష్య మాత్రుడెవడూ వాటిని ఎక్క సాహసించడు.



అవి కొబ్బరిచెట్లని సింద్‌బాద్ తెలుసుకున్నాడు. వాటిమీద కొబ్బరికాయలూ, కొండముచ్చులూ పుష్కలంగా ఉన్నాయి.

అందరూ చెట్లకిందికి చేరి, తమ సంచులలో ఉన్న గులకరాళ్ళతో కొండముచ్చులను కొట్టసాగారు. కొండముచ్చులు కొబ్బరికాయలు కోసి, కింద ఉన్నవాళ్ళమీద విసిరాయి. అందరూ కొబ్బరికాయలు ఏరుకుని, సంచులలో వేసుకున్నారు, సంచులు నిండగానే వాళ్లు వాటిని భుజాల కెత్తుకుని నగరంలోకి వెళ్ళారు.

సింద్‌బాద్ తెచ్చిన కొబ్బరికాయలను అతని స్నేహితుడైన వర్తకుడు తీసుకుని,



వాటి ధర సింద్‌బాదు కిచ్చేశాడు. సింద్‌బాద్ ఇలా రోజూ లోయకు వెళ్ళి, కొబ్బరికాయలు తెచ్చి, తన మిత్రుడికి అమ్మి, ఆ వచ్చిన డబ్బుతో వ్యాపారం చేసి, ముత్యాలదీవికి వెళ్ళటానికి ఓడ కేవుకు సరిపడినంత డబ్బు పోగుచేశాడు.

అతను ముత్యాలదీవికి వెళ్ళేటప్పుడు చాలా కొబ్బరికాయలు తన వెంట తీసుకుపోయాడు. అక్కడక్కడా తగిలిన రేవులలో కొబ్బరికాయలు అమ్మి, మిరియాలూ, లవంగపట్టా కొని, మరికొన్ని దీవులలో ఆ సరుకు మంచి లాభానికి అమ్మాడు. ఈ డబ్బు ముత్యపుచిప్పలు ఏరేవాళ్ళకు కూలి ఇవ్వటానికి పనికి వచ్చింది.

ముత్యపుచిప్పలలో మంచి ముత్యాలు దొరకటం కేవలం అదృష్టం. సింద్‌బాద్‌కు అదృష్టం కలిసివచ్చి, అతను సంపాదించిన ముత్యపుచిప్పలలో మంచి ముత్యాలు దొరికాయి. వాటిని అక్కడి వర్తకులకు అమ్మగా మంచి ధర వచ్చింది. త్వరలోనే అతను చాలా డబ్బు పోగు చేసుకున్నాడు. అతనికి ఇంటి పైన ధ్యాస మళ్ళింది. తిరుగు ప్రయాణానికి అవసరమైన ఏర్పాట్లన్నీ చేసుకుని, దారిలో తగిలే రేవుల్లో అమ్మటానికి ముసాంబరం చెక్క పుష్కలంగా కొని ఓడ కెక్కించాడు. ఈ ముసాంబరం చెక్క ఆ దీవులలో ఎక్కడబడితే అక్కడ దొరుకుతుంది.

ఆ సరుకంతా దారివెంట విక్రయిస్తూ సింద్‌బాద్ బస్రా మీదుగా బాగ్దాద్‌నగరం చేరుకున్నాడు.

అతను క్షేమంగా తిరిగి వచ్చినందుకు అతని బంధుమిత్రులందరూ ఎంతో సంతోషించారు. సముద్రయానం లాభసాటిగా ముగియటంచేత అతను పేదసాదలకు దానధర్మాలు చేసి, మళ్ళీ యథాప్రకారం భోగభాగ్యాలతో తులతూగుతూ, సుఖజీవనం గడపసాగాడు.





# సింద్‌బాద్ అద్భుతయాత్రలు

సింద్‌బాద్ ఒకనాటి సాయంకాలం చల్లగాలికి తన ఇంటిముందు కూర్చుని ఉండగా వీధి వెంబడి కొందరు వర్తకులు పోతూ కనిపించారు. వారు దూరదేశాల నుంచి తిరిగి వస్తున్నట్టు సింద్‌బాద్ గ్రహించగలిగాడు. ఎందుకంటే, చాలా కాలం గడిచాక స్వదేశానికి తిరిగి రావటంచేత వారి ముఖాలలో ఆనందం తాండవిస్తున్నది. ఆ ఆనందం దేశంలోనే ఉండిపోయిన వాడికి అర్థంకాదు.

అది చూసినాక సింద్‌బాద్ మనసు మరొకసారి విదేశవ్యాపారం మీదికి మళ్ళింది. వెంటనే అతను వ్యాపార సరుకులు కొని వాటితో బస్రా చేరాడు. అక్కడ ఒక ఓడ సముద్రయానానికి సిద్ధంగా ఉన్నది. అందులో అనేకమంది వర్తకులూ, రాజప్రయాణీకులూ ఉన్నారు. సింద్‌బాద్ తన సరుకులను ఆ ఓడ కెక్కించి, అందులో ప్రయాణమైనాడు.

ఓడ ఒక నగరం నుంచి మరొక నగరానికీ, ఒక దేశం నుంచి మరొక దేశానికీ ప్రయాణం చేసింది. ప్రతిచోటా క్రయ విక్రయాలు జరిగాయి. దారిలో అనేక వింతలు తెలిశాయి. ఒకనాడు ప్రయాణీకులందరూ ఓడ పైభాగాన విశ్రాంతి తీసుకుంటూ ఉండగా ఓడ సరంగు పెద్దపెట్టున అరిచి, తలగుడ్డ కిందకొట్టి గడ్డం పీక్కోసాగాడు.

అందరూ అతని చుట్టూ మూగి అతని విచారానికి కారణం అడిగారు.

"మనం దారి తప్పాం. ఇది తెలియని సముద్రం. ఇక మనను అల్లా రక్షించవలసిందే. అందరూ అల్లాను ప్రార్థించండి." అన్నాడు సరంగు.

అతను అలా అంటూండగానే ఒక భయంకరమైన గాలి ప్రారంభమయింది. దాని దెబ్బకు ఓడ చుక్కాని కాస్తా విరిగి

ఆరవ యాత్ర



పోయింది. ఓడ నావికుల వశం తప్పి, గాలికి కొట్టుకుపోసాగింది. ప్రయాణీకులు హాహాకారాలు చేశారు. త్వరలోనే ఓడ ఒక కొండకు కొట్టుకుని తునాతునకలైపోయింది. కొందరు ప్రయాణీకులు సముద్రం పాలయారు. సింద్‌బాద్ మరికొందరితోబాటు నీటిలో ఈదుకుంటూ నీటి మధ్య ఉండే రాళ్ళగుట్టను చేరి, ప్రాణాలు దక్కించుకోగలిగాడు.

సముద్రంలోకి చొచ్చుకువచ్చిన ఆ కొండ ఒక దీవిలో ఉన్నది. అక్కడ ఎన్నో ఓడలు పగిలిపోయాయి. వాటి శిథిలాలూ, వాటి తాలూకు సరుకుల పెళ్ళా తీరమంతటా చెల్లాచెదరుగా పడి ఉన్నాయి. కొన్ని పెళ్ళు పగిలి వాటి నుంచి విలువైన వస్తువులు బయటికి వచ్చి ఉన్నాయి.

చావగా మిగిలినవాళ్ళు తీరం చేరుకున్నారు. సింద్‌బాద్ ద్వీపంలోకి నడిచిపోయి ఒక కొండవాగు చేరుకున్నారు. ఆ వాగు కొండ నుంచి బయలుదేరి, లంక మీద కొంతదూరం ప్రవహించి, ఒక గుహలోకి అదృశ్యమయింది. ఆ వాగుకు రెండు పక్కలా, నీటి అడుగునా కూడా మాణిక్యపు రాళ్ళూ, వెండి, బంగారు కణికలూ ఉండి ధగధగా మెరుస్తున్నాయి. అక్కడ పడి ఉన్న సంపదను ఏ మనిషీ ఎక్కడా చూసి ఉండడు. వాగు వెంట ముసాంబరం చెట్లున్నాయి.

ఈ దీవి మీద సింద్‌బాద్‌కు మరొక అద్భుతం కనబడింది. కొండ మీద అంతులేని అంబరు ఉన్నది. ఎండవేడికి కరిగి అది ప్రవాహం కట్టి, సముద్రజలంలోకి జారులాగా ప్రవహిస్తున్నది. ఆ అంబరును చేపలు తాగి, జీర్ణం చేసుకోలేక వాంతి చేసుకోగా, అది గట్టిపడి తృణమణి అయి, నీటి మీద తేలి ఒడ్డుకు కొట్టుకువస్తున్నది.

ఇక్కడ ఇంత సంపద ఉండి కూడా మనిషికి లభ్యంకాదు. ఎందుకంటే

ఆ ప్రాంతానికి వచ్చిన ఓడ విధిగా పగిలిపోతుంది. అందుచేత సింద్‌బాద్ మొదలైనవారు అంత సంపద మధ్యా ఆకలితో అలమటించవలసి వచ్చింది. అందరి దగ్గిరా ఉన్న కొద్ది ఆహారాన్ని అందరూ సమంగా పంచుకున్నారు. కాని అది ఎంత కాలం వస్తుంది? సింద్‌బాద్ ఉపవాసాలకు బాగా అలవాటైనవాడు కావటంచేత తన వంతు ఆహారాన్ని కొంచెం కొంచెమే తింటూ ఎలాగో ప్రాణాలు కాపాడుకున్నాడు. మిగిలినవాళ్ళు తమ వంతు ఆహారాన్ని త్వరగా పూర్తి చేసి, ఒక్కొక్కరుగా ఆకలికి చావసాగారు. చచ్చినవాళ్ళను బతికి ఉన్నవాళ్ళు సముద్రతీరాన పూడ్చేస్తూ వచ్చారు. కొంతకాలానికి ఆఖరువాణ్ణి పూడ్చేసి, లంక మీద సింద్‌బాద్ ఒక్కడే మిగిలాడు.

ఎంత పొదుపుగా తిన్నా అతని ఆహారం అయిపోయింది. ఆకలిరాకాసి అతన్ని పట్టేసింది. ఆఖరు క్షణం వచ్చినప్పుడు పడుకునే ఉద్దేశంతో అతను ఒక గొయ్యి తవ్వుకుని, తన శవం మీద ఇసక పోసే భారం గాలికి వదిలేశాడు.

తన భవిష్యత్తు తలుచుకుంటే అతనికి దుఃఖం వచ్చింది. అయిదుసార్లు వెంట్రుకవాసిలో చావు తప్పినా తనకు ఎందుకు బుద్ధి రాలేదు? దాలిగుంటలో కుక్క





లాగా తాను నేర్చుకున్న గుణపాఠం పదే పదే ఎందుకు మరిచిపోవాలి? డబ్బు కోసం ఇంత గడ్డి తినాలా? ఎన్ని తరాలకైనా సరి పడిన సంపద తనకున్నదే!

ఇంత విచారంలోనూ అతని బుర్ర వేరే ఆలోచన చేస్తున్నది: ఆ గుహలోకి పోయిన వాగు ఏమైనట్టు? అది మరెక్కడో బయటికి రావద్దా? అది ఎక్కడికి పోతున్నది? ఇక్కడ తిండికి మాడి చచ్చేకన్న ఆ వాగు ఎటు పోతున్నదో తెలుసుకోవటం ఫలం పాటు కాదా?

ఈ ఆలోచన కలగగానే సింద్‌బాద్‌లో కొంత కొత్త శక్తి వచ్చింది. అతను ముసాంబరం చెట్లకున్న పెద్ద పెద్ద కొమ్మలు విరిచి, వాటిని ఒక తెప్పలాగా తయారు చేసి, దాని మీద పగిలిన ఓడల చెక్కలు కొన్ని పరిచి, కొన్ని పెద్ద పెద్ద రత్నాలూ, తృణమణులూ ఏరి తెప్ప మీద పెద్ద కుప్ప పోసి, తెప్ప మీద ఎక్కి రెండు కర్రలను తెడ్లుగా ఉపయోగిస్తూ, వేగంగా ప్రవహించే వాగు వెంట బయలుదేరాడు.

వాగు గుహలో దూరిన చోట తెప్ప కూడా దూరింది. గుహ లోపల కటిక చీకటి. వాగు ఎన్ని మెలికలు తిరిగితే తెప్ప కూడా అన్ని మెలికలూ తిరిగింది. మెలిక వచ్చిన చోట అది, అటూ ఇటూ ఉన్న కొండను కొట్టుకున్నది. అక్కడక్కడా సింద్‌బాద్ తల, మీద నున్న రాతికి తగులుతున్నది. గాఢాంధకారం కావటంచేత చూసి తలవంచే అవకాశం లేదు. పోనుపోను పల్లంగాగున్నది; ప్రవాహ వేగం హెచ్చింది.

సింద్‌బాద్‌కు ఈ వాగులో చచ్చే కన్న అదు బయట తిండికి మాడి చస్తేనే బాగుండే దనిపించింది. చేసేదేమీ లేక అతను తెప్పను కరుచుకుని బోర్లాపడుకుని, ఒళ్ళు తెలియని నిద్రలో పడిపోయాడు.

తాను ఎంతసేపు స్పృహ తప్పి ఉన్నదీ సింద్‌బాద్ ఎరగడు. అతనికి తిరిగి తెలివి

వచ్చేసరికి అత నొక పచ్చిక మైదానంలో పడుకుని ఉన్నాడు. పైన ఎండ కాస్తున్నది. అతని తెప్ప ఒక నది ఒడ్డున కట్టిపెట్టి ఉన్నది. అతని చుట్టూ జనం మూగి ఉన్నారు. వాళ్ళు ఇతియోపియనులు.

సింద్‌బాద్ కళ్ళు తెరవగానే వాళ్ళు మాట్లాడ నారంభించారు. కాని వాళ్ళ భాష అతనికి అర్థం కాలేదు. అయితే వారిలో ఒకడు ముందుకు వచ్చి, అరబ్బీ భాషలో, "మీ రెవరు? ఎక్కడి నుంచి వచ్చారు? మా దేశానికి ఏం పని మీద వచ్చారు? మేము రైతులం; మా పొలాలకు నీరు పెట్టుకుంటూ, మీరు నది వెంబడి రావటం చూసి, తెప్పను ఆపి, నది ఒడ్డున కట్టేసి, మిమ్మల్ని తెచ్చి ఇక్కడ పడుకోబెట్టాం," అన్నారు.

"కాస్త తిండి పెట్టండి, అంతా చెబుతాను," అన్నాడు సింద్‌బాద్.

వెంటనే వాళ్ళు అతనికి భోజనం పెట్టారు. అతనికి ప్రాణాలు తిరిగి వచ్చాయి. అతను వాళ్ళకు తన కథ అంతా చెప్పాడు. అతని కథను అరబ్బీ భాష వచ్చినవాడే మిగిలిన వాళ్ళకు అనువదించి చెప్పాడు. వాళ్ళు ఆశ్చర్యంగా తమలో తాము మాట్లాడుకున్నారు. వాళ్ళు అతన్ని తమ రాజు దగ్గిరికి తీసుకుపోయి, ఆయనకు అతని కథ





ఎనిపించాలని నిశ్చయించారు. అందుకు సింద్‌బాద్ ఒప్పుకున్నాడు. వాళ్ళు అతన్నీ, అతని తెప్పనూ, అతను ఏరుకు వచ్చిన రత్నరాశినీ మోస్తూ రాజు వద్దకు వెళ్ళారు.

వాళ్ళ రాజు సింద్‌బాద్‌ను చాలా ఆదరించి, అతని కథ అంతా విని, ప్రాణాలు దక్కినందుకు అభినందించాడు. అతను తెచ్చిన రత్నాలూ, తృణమణులూ చూసి ఆయన మెచ్చుకున్నాడు. ఆయనే రత్న నిపుణుడు. సింద్‌బాద్ ఆయనకు రకానికి ఒక మణి చొప్పున ఎంచి బహూకరించాడు. రాజు అతన్ని తన అతిథిగా ఉంచుకుని, చాలా మర్యాద చేశాడు.

రాజు వద్ద కొలువుండేవాళ్ళు బాగ్దాదు గురించీ, ఖలీఫా గురించీ, ఆయన పరిపాలన గురించీ అనేక ప్రశ్నలు వేశారు. అతని సమాధానాలన్నీ విని రాజు, "మీ ఖలీఫా హారూనల్ రషీద్‌గారు చాలా యోగ్యుడిలా కనిపిస్తారు. ఆయన పట్ల నా స్నేహభావాన్ని ప్రకటించటానికి నీ ద్వారా బహుమతులు పంపుదామనుకుంటున్నాను," అన్నాడు.

"అలాగే చెయ్యండి. నేను మీ బహుమానాలను వారికి అందజేసి, తమరు చాలా యోగ్యులనీ, స్నేహపాత్రులనీ వారికి విన్నవిస్తాను," అన్నాడు సింద్‌బాద్.

వెంటనే రాజు ఖలీఫా కోసం పంపే బహుమతులన్నీ తెప్పించాడు. వాటిలో ఒక కూజా ఉన్నది. అది వేలిమందమూ, అరంగుళం ఎత్తూ ఉన్నది. దానిని కెంపు రాయిలో మలిచారు. ఆ కూజా నిండా ముత్యాలున్నాయి. అవి పోకకాయల ప్రమాణంలో ఉన్నాయి. బహుమతులలో ఒక పెద్ద తివాసీ ఉన్నది. దానిని అచ్చంగా పాముచర్మంతో తయారుచేశారు. దాని మీద రోగులు పడుకుంటే వారికి ఆరోగ్యం కలుగుతుందట. మిగిలిన బహుమతులలో రెండువందల కర్పూరపు ఉండలూ, చాలా

పెద్ద ఐరావత దంతాలూ ఉన్నాయి. ఆపాదమస్తకమూ ఆభరణాలు దిగవేసిన దాసీది కూడా ఖలీఫాకు బహుమతిగా పంపబడుతున్నది.

రాజు ఖలీఫాకు తాను రాసిన ఉత్తరం సింద్‌బాదుకు ఇస్తూ, "ఈ స్వల్ప బహుమతులు పంపుతున్నందుకు మీ ఖలీఫా గారికి నా క్షమాపణలు చెప్పు. వీటి కన్న విలువైనది నాకు వారి పట్ల గల స్నేహభావం... కాని, సింద్‌బాద్, నువ్విక్కడ ఉండిపోతే నేనింకా సంతోషిస్తాను. నీకు ఏ లోపమూ జరగకుండా నేను చూస్తాను. ఖలీఫాగారికి ఈ బహుమానాలు మరెవరైనా తీసుకుపోతారు. ఉండిపోతా వేమిటి? చెప్పు!" అన్నాడు.

సింద్‌బాద్ రాజుకు క్షమాపణ చెప్పుకున్నాడు. త్వరలోనే బస్రాకు ఓడ బయలుదేరుతున్నదనీ, తన దేశాన్నీ, తన వారినీ చూడాలని తాను తహతహలాడిపోతున్నాననీ ఆతను రాజుతో అని, వెళ్ళిపోవటానికి ఆయన అనుమతి వేడాడు.

సింద్‌బాద్‌ను బలవంతాన ఉంచేద్దామనే ఉద్దేశం రాజుకు ఏ కోశానా లేదు. ఆయన ఓడ సరంగునూ, అందులో ప్రయాణం చేస్తున్న వర్తకులనూ పిలిపించి, వారందరికీ సింద్‌బాద్‌ను పరిచయం



చేసి, అతనిని జాగ్రత్తగా చూసుకోమని వెయ్యి హెచ్చరికలు చేసి, అతని ఓడకర్చు తానే ఇచ్చి, అతనికి తన తరఫున అంతు లేని కానుక లిచ్చాడు.

సింద్‌బాద్ రాజుగారికి తన కృతజ్ఞత తెలుపుకుని, అందరి వద్దా సెలవు పుచ్చుకుని ఓడ యెక్కాడు. దారిలో ఎలాటి అవాంతరాలూ జరగకుండా అతను బస్రా చేరి, అక్కడి నుంచి బాగ్దాదు చేరుకున్నాడు. అతను బాగ్దాదు రేవులో దిగుతూనే తిన్నగా రాజభవనానికి వెళ్ళి ఖలీఫా దర్శనం చేసుకుని, ఆయనకు ఇతియోపియా రాజుగారి ఉత్తరం అందించాడు.

ఖలీఫా ఆ ఉత్తరం చదువుకుని, సింద్‌బాద్ తెచ్చిన బహుమతులు పరీక్షించి, "ఇవన్నీ పంపటానికి ఆ రాజు అపార సంపదగలవాడై ఉండాలి. అతను నిజంగా అంత సంపన్నుడేనా?" అని సింద్‌బాద్‌ను అడిగాడు.

"ప్రభూ, అందుకు సందేహం లేదు. ఆయన సంపన్నుడే కాదు న్యాయశీలుడు. దక్షత గల పాలకుడు. ఆయన పాలనలో ప్రజలు ఎంత సుఖపడుతున్నారంటే, వారికీ రాజుకూ మధ్య ఎలాటి ఘర్షణా తలెత్తదు. అంతేకాక ఆయన చాలా స్నేహపాత్రుడూ, విశ్వసనీయుడూనూ," అని సింద్‌బాద్ ఖలీఫాకు చెప్పాడు.

ఖలీఫా సింద్‌బాద్‌కు అనేక బహుమానాలు ఇచ్చి సత్కరించాడు. ఆయన ఆస్థాన లేఖకులను పిలిపించి, సింద్‌బాద్ అనుభవాలన్నీ లిఖితం చేయించి, అతని కథ యావత్తూ ఇతిహాస పత్రాలలో చేర్చవలసిందిగా ఉత్తరు విచ్చారు.

సింద్‌బాద్ ఖలీఫా వద్ద సెలవు పుచ్చుకుని, తన ఇంటికి చేరుకుని, తనవారి నందరినీ తిరిగి కలుసుకుని, గౌరవమర్యాదలూ, భోగభాగ్యాలూ అనుభవిస్తూ, ఏ లోటూ లేకుండా సుఖజీవనం వెళ్ళబుచ్చాడు.





# సింద్‌బాద్ అద్భుతయాత్రలు

సింద్‌బాద్‌కు సముద్రయానాల మీద విముఖత కలిగింది. వయసు కూడా వచ్చేసింది. తన జీవితంలో పడవలసిన కష్టాలన్నీ పడ్డాడు. వ్యాపారం ద్వారా అంతులేని సంపద పోగుచేసి, బాగ్దాదునగరంలో తనకు మించిన ధనికుడు లేడనిపించుకున్నాడు. ఖలీఫా స్నేహం సంపాదించుకున్నాడు. ఆయన అతన్ని అప్పుడప్పుడూ పిలిపించి అతని అనుభవాలు చెప్పించుకుని వింటున్నాడు. ఈ పరిస్థితులలో అతనికి దేశాటన చెయ్యాలని, ఏళ్ళతరబడి దేశాంతరాలలో అగచాట్లు పడాలని ఉత్సాహం కలగలేదు. ఇంటిపట్టునే ఉండాలనిపించింది.

అయితే తలవని తలంపుగా అతను మరొకసారి ప్రయాణం చెయ్యవలసి వచ్చింది. ఖలీఫా హారూనల్ రషీద్ అతన్ని పిలిపించి, "సింద్‌బాద్, ఇథియోపియా రాజుకు సమాధానం పంపదలచాను. ఆయన కోసం కొన్ని కానుకలు కూడా సిద్ధం చేశాను. వాటిని నీ ద్వారానే పంపదలచాను. నిన్ను మళ్ళీ చూసి ఆయన ఎంతో సంతోషిస్తాడు. ఇవాళే నువ్వు బయలుదేరి వెళ్ళాలి," అన్నాడు.

తనకు సముద్రయానం మీద ముఖం మొత్తిందని ఖలీఫాతో ఎలా చెప్పటం? తన అయిష్టాన్ని ఖలీఫాకు ఏమాత్రమూ తెలియనివ్వక, తాను ప్రయాణానికి సిద్ధంగా ఉన్నానన్నాడు సింద్‌బాద్.

ఖలీఫా దారిఖర్చుల కింద అతనికి పదివేల దీనారా లిచ్చాడు; ఇథియోపియా రాజుకు తాను పంపించే సమాధానమూ, బహుమానాలూ కూడా సింద్‌బాద్ పరం చేశాడు. ఖలీఫా పంపే బహుమానాలలో ఎర్ర ముఖ్మల్ పరుపూ, మరి రెండు వేరే రంగుల మెత్తలూ, నూరు పట్టుతానులూ, తెల్ల

ఏడవ యాత్ర



కురువింద రత్నాలతో తయారుచేసిన కూజా, మేలుజాతి అరబ్బీ గుర్రాలూ ఉన్నాయి.

సింద్‌బాద్ పేటన్నిటినీ తీసుకుని బస్రా చేరి, అక్కడ ఒక ఓడ పట్టుకున్నాడు. ఆ ఓడ ఇథియోపియా రాజుండే దీవి చేరటానికి మూడు మాసాలు పట్టింది. ఇథియోపియా రాజు, ఖలీఫా పంపిన లేఖా, కానుకలూ అందుకుని చాలా సంతోషించి, ఖలీఫా ఔదార్యాన్ని కొనియాడాడు. ఆయన సింద్‌బాద్‌ను చాలాకాలం ఉండి పొమ్మన్నాడు గాని, సింద్‌బాద్ కొద్దిరోజులు మాత్రమే ఉండి, బస్రాకు తిరుగు ప్రయాణం కట్టాడు.



అతను ఎక్కిన వర్తకపు ఓడకు గాలి అనుకూలంగా ఉండటంచేత ప్రయాణం సుఖంగా సాగింది. దారిలో సేనదీవి తగిలింది. అక్కడ వర్తకులు క్రయ విక్రయాలు చేశారు. ఓడ ఆ దీవిని వదిలిన వారం రోజులకు పెద్ద వర్షాలు ఆరంభమయాయి. సరుకులు తడిసి పోకుండా బేళ్ళ మీద కాన్వాసు కప్పారు.

ఓడ సరంగు తెరచాప స్తంభం ఎక్కి, చాలా సేపు అన్ని దిక్కులా పరీక్షించి చూశాడు. చివరకు అతను కిందికి దిగి వచ్చేసరికి అతని ముఖంలో రక్తం లేదు; అందరి కేసీ వెర్రిగా చూస్తూ, నిశ్శబ్దంగా గడ్డం పీక్కుంటున్నాడు.

అందరూ అతని చుట్టూ మూగి, "ఏమిటి? ఏమిటి?", అని అడిగారు.

"అల్లాను ప్రార్థించండి. మనని అల్లా తప్ప ఎవరూ కాపాడలేరు. మనం తోవ తప్పి మారుమూల సముద్రం చేరాం!" అన్నాడతను.

తరవాత అతను ఒక పట్టు పొడుంపీల్చి ఏదో పుస్తకం తీసి అందులో చూసి, "అనుకున్నంతా అయింది! ఆ కనిపించే తీరం భయంకరమైనది. ఈ సముద్రంలో ఓడలను మింగేపాటి తిమింగిలాలున్నాయి.



ఆ తీరాన అతి భయంకరమైన జంతువులూ, మహాసర్పాలూ ఉన్నాయి. ఉన్న సంగతి చెప్పేశాను," అన్నాడు.

అతనామాట అంటూండగానే ఓడ ఇంత ఎత్తున లేచి, మళ్ళీ నీటిమీద పడింది. ప్రయాణీకుల గుండెలు క్షణంపాటు ఆగి పోయాయి. సముద్రమంతా తెర్లుతున్నది. నీటిని అలా చేస్తున్నవి మూడు తిమింగి లాలు. అవి కొండల్లాగా ఉన్నాయి. అవి ఓడను తరుముతూ వస్తున్నాయి.



ఒక తిమింగిలం తన నోటిని తెరిచి ఓడను అందుకున్నది. సింద్‌బాద్ నీటిలోకి దూకేశాడు. మరుక్షణం ఆ తిమింగిలం అతనుండిన ఓడను మింగేసింది! తరవాత మూడు తిమింగిలాలూ ఈదుకుంటూ తమ దారిన వెళ్ళిపోయాయి.

తిమింగిలం ఓడను మింగేటప్పుడు దాని పలక ఒకటి విరిగి నీటిలో పడింది. సింద్ బాద్ దానిమీదికి ఎగబాకి, కాళ్లతోనూ, చేతుల తోనూ నీటిని తోస్తూ, ఒక లంకను చేరు కున్నాడు. ఆ లంకలో పళ్లచెట్లు ఉన్నాయి. అతనికి అక్కడ ఒక నది కూడా కనిపిం చింది. అది వేగంగా ప్రవహిస్తున్నది.

ఆ నదే తనను కాపాడితే కాపాడాలని, లేకపోతే తన కిక భూమి మీద నూకలు చెల్లినట్టేనని సింద్‌బాద్ అనుకున్నాడు. (కిందటిసారి నది ద్వారానే అతను రత్నాల దీవి నుంచి బయటపడ్డాడు.) అందుచేత అతను ఒక చెట్టు కొమ్మలు పోగుచేసి, దృఢ మైన లతలతో వాటిని కలిపి కట్టి తెప్ప తయారు చేశాడు. తరవాత చెట్ల పళ్ళు కొన్ని తిని, మరికొన్ని తెప్ప మీద పేర్చు కుని, తెప్పతో సహా ప్రవాహంలోకి జారాడు. తెప్ప బాణం లాగా దూసుకుపోయింది. ఆ వేగానికి అతను పళ్ల కుప్ప మీదికి పడిపోయాడు.

పోయిన కొద్దీ నది వేగం హెచ్చుతున్నది. నీరు నురుగులు కక్కుతున్నది. దూరా



నుంచి హోరు వినవస్తున్నది. ముందుకు చూస్తే, అంత దూరాన నది అకస్మాత్తుగా అయి పోయినట్టు కనిపించింది. అక్కడ జలపాతం ఉన్నదనీ, ఆ జలపాతపు హోరే వినవస్తున్నదనీ సింద్‌బాద్ గ్రహించాడు. తాను తెప్పతో సహా ఆ జలపాతంలో పడి పోతాడు. అదే అతని ఆఖరుక్షణం! అతను మనసు భగవంతుడి మీద లగ్నం చేసి, కళ్ళు మూసుకుని, తెప్పను గట్టిగా కరుచుకుని పడుకున్నాడు.

తెప్ప జలపాతాన్ని చేరటమూ, పడి పోవ టానికి ఒరగటమూ అతనికి తెలుసును. అయితే అలా ఒరిగిన తెప్ప, ఒరిగినట్టే ఉండిపోయింది; మరి కదలలేదు, కిందికి పడిపోలేదు.

ఆశ్చర్యంతో అతను కళ్ళు తెరిచి చూశాడు. అతన్నీ, అతని తెప్పనూ ఒక వల పట్టేసింది. ఆ వలను విసిరినవాళ్ళు ఒడ్డున ఉన్నారు. వాళ్ళు వలను లాగి, అతన్నీ తెప్పనూ ఒడ్డుకు చేర్చారు.

సింద్‌బాద్ చలికి వణుకుతూ, సగం చచ్చి ఒడ్డున పడుకుని ఉండగా, తెల్లని గడ్డం గల ఒక వృద్ధుడు అతన్ని దయగా పలకరించి, అతని మీద వెచ్చని బట్టలు కప్పాడు; అతని శరీరమంతా మృదువుగా మర్దన చేశాడు.

వృద్ధుడు చేసిన ఈ ఉపచారాలతో సింద్‌బాద్‌కు కొత్త బలం చేకూరింది. అతను లేచి కూర్చోగలిగాడు గాని మాట్లాడలేక పోయాడు. ఆ స్థితిలో అతన్ని వృద్ధుడు స్నానశాలకు తీసుకుపోయి, అతని శరీరాన్ని సుగంధ తైలాలతో మర్దన చేయించి, స్నానం అయాక తన ఇంటికి తీసుకుపోయి, తృప్తిగా భోజనం పెట్టించాడు. వృద్ధుడి ఇంట్లో అందరూ సింద్‌బాద్‌ను ఆప్యాయంగా చూశారు. వృద్ధుడు ఇంట్లో ఉన్నా లేక పోయినా, సింద్‌బాద్ అవసరాలు చూడ టానికి మనుషులు హాజరుగా ఉండేవారు.

అతను ఆ వృద్ధుడి ఇంట మూడు రోజు లున్నాడు. కాని ఆ మూడు రోజులూ, వృద్ధుడు గాని, అతని వాళ్ళు గాని సింద్‌బాద్‌ను ఎలాటి ప్రశ్నలూ వెయ్యలేదు.

మూడు రోజులకు సింద్‌బాద్ తేరుకుని మామూలు మనిషి అయాడు. నాలుగో రోజున వృద్ధుడు సింద్‌బాద్‌తో, "మీకు ఏ లోపమూ కలగటం లేదు గద? అల్లా అనుగ్రహం వల్ల నేనా సమయానికి అక్కడ ఉండి మిమ్మల్ని ఆపద నుంచి కాపాడగలి గాను....ఇంతకూ మీ రెవరు? ఎక్కడ నుంచి వస్తున్నారు?" అన్నాడు.



సింద్‌బాద్ ఆ వృద్ధుడికి తన కృతజ్ఞత తెలుపుకుని, తన కథ అంతా చెప్పేశాడు. తాను అనేకమార్లు సముద్రయానాలు చేసిన వర్తకుణ్ణని సింద్‌బాద్ చెప్పగానే, వృద్ధుడు, "అలా అయితే, మీ సరుకు వెంటనే అమ్మే య్యటం మంచిది. అది చాలా మేలురకం సరుకు. దానికి ఇక్కడ మంచి గిరాకీ ఉన్నది," అన్నాడు.

సింద్‌బాద్ ఆ మాట విని నిర్ఘాంత పోయాడు. వృద్ధుడు ఏ సరుకు గురించి మాట్లాడుతున్నదీ అతనికి అర్థం కాలేదు. అతను కట్టు బట్టలతో ఉన్నాడు. అతని వద్ద వర్తకపు సరుకు పూచికపుల్ల కూడా లేదు. అయినా ఆ మాట పైకి అనక, సింద్‌బాద్ వృద్ధుడితో, "తొందరేం, చూదాం లెండి!" అన్నాడు.

"ఇంక జాప్యం దేనికి? అలా బజారుకు వెళ్ళి, మంచి ధర పలుకుతుందేమో విచా రిందాం. లేకపోతే వచ్చిన నష్టం లేదు. సరుకు నా గిడ్డంగిలోనే ఉంటుంది," అన్నాడు వృద్ధుడు.

"మీ ఇష్టం, బాబుగారూ. మీరేది చేస్తే నేను కాదంటాను గనక? నేను మీ చేతిలో వాణ్ణి. నాతో చెప్ప నవసరం కూడా లేదు, తోచినట్టు చేసెయ్యండి!" అన్నాడు సింద్‌బాద్.



ఇద్దరూ కలిసి బజారుకు వెళ్ళారు. అక్కడ తన తెప్ప ఉండటం చూసి సింద్‌బాద్ నిర్ఘాంతపోయాడు. ఆ తెప్పను వర్తకులూ, దళార్లూ పరీక్ష చేస్తున్నారు. "యా అల్లా! ఏమి అద్భుతమైన చందనం! ఇంత మంచి దినుసు ఎన్నడూ చూసి ఎరగను!" అంటున్నారెవరో.

తాను తెప్ప కట్టుకున్నది మేలు జాతి అగరుచందనం చెట్టుకొమ్మలని సింద్‌బాద్‌కు తెలిసి వచ్చింది. అతను పైకి గుంభనగా ఉండిపోయాడు.

ఆ తెప్ప కోసం వర్తకులు వేలం పాడారు. పాట వెయ్యి దీనారాలతో ఆరంభమై పది వేల దాకా పెరిగింది. వేలం వేసేవాడు సింద్‌బాద్ కేసి తిరిగి, "పదివేలకు కొట్టెయ్యమంటారా?" అని అడిగితే సింద్‌బాద్ వద్దన్నాడు.

కాని వృద్ధుడు అతనితో, "బాబూ, ఇంత కన్న ధర రాదు. కావలిస్తే నేనే మరో నూరు పెచ్చు వేసి తీసుకుంటాను," అన్నాడు.

"మీరే తీసుకువెటట్టుంటే నేను కాదంటానా, బాబుగారూ?" అన్నాడు సింద్‌బాద్.

తెప్పను వృద్ధుడి గిడ్డంగికి ఆయన బానిసలు చేరవేశారు. వృద్ధుడు సింద్‌బాద్‌కు పదివేల ఒకవంద దీనారాలు పెట్టెలో పెట్టి ఇచ్చాడు. తరవాత ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ భోజనం చేసేటప్పుడు వృద్ధుడు సింద్‌బాద్‌తో అన్నాడు:

"బాబూ, నాకు మగపిల్లలు లేరు. కాని బోలెడంత ఆస్తి ఉన్నది. చాలా పదవులు కూడా నిర్వహిస్తున్నాను. నా ఆస్తికంతా వారసురాలు నా కూతురు. దాన్ని పెళ్ళాడి నా ఆస్తికీ, హోదాలకూ వారసుడివవుతావా ఏమిటి?"

"బాబయ్యా, మీ మాట ఎలా కాదనేది?" అన్నాడు సింద్‌బాద్.

వెంటనే వృద్ధుడు కాజీని, సాక్షులనూ పిలిపించి సింద్‌బాద్‌కు తన కుమార్తె నిచ్చి





పెళ్ళి చేశాడు. ఆమె చాలా అందమైనది. ఆమె వంటిపైన అనేక వేల దీనారాల విలువ గల నగలు ఉన్నాయి. ఆమెతో అన్యోన్యంగా కాపురం చేస్తూ, మామగారికి వ్యాపారంలో సహాయపడుతూ సింద్‌బాద్ చాలా కాలం అక్కడే ఉండిపోయాడు.

కొంతకాలం గడిచాక, సింద్‌బాద్ మామగారైన వృద్ధుడు చనిపోయాడు. సింద్‌బాద్ ఆయనకు ఉత్తర క్రియలు ఆర్భాటంగా జరిపించాడు. మామగారి ఆస్తికి వారసుడై ఆ ప్రాంతానికి తానిప్పుడు ముఖ్యుడైనందున సింద్‌బాద్ అక్కడి ఆచారాలను మరింత శ్రద్ధగా పాటించవలసి వచ్చింది.

అతనిప్పుడు ఉన్న నగరంలో ఏటా ఒక వింత జరుగుతుంది. ప్రతి ఏడూ వసంత కాలంలో ఒక్కరోజున అక్కడి పురుషుల కందరికీ రెక్కలు వస్తాయి. ఆ రోజల్లా వారు గగన విహారం చేస్తారు. ఈ రెక్కలు స్త్రీలకూ, పిల్లలకూ రావు. వారు నగరంలోనే ఉండిపోతారు.

చిత్రమేమిటంటే, అందరు పురుషులకూ వచ్చే రెక్కలు సింద్‌బాద్‌కు రాలేదు. అందుచేత నగరంలోని పురుషులంతా గగన విహారం వెళ్ళిన నాడు అతను స్త్రీలతోనూ, పిల్లలతోనూ పాటు నగరంలో ఉండిపోయాడు. తనకు రెక్కలు రాని కారణం ఏమిటన్నది సరిగా తెలియలేదు.

అందుచేత సింద్‌బాద్ తనకు రుణపడి ఉన్న ఒక వర్తకుడితో రహస్యంగా ఏర్పాటు చేసుకుని, ఆ వర్తకుడు రెక్కలతో ఆకాశంలో విహరించేనాడు అతని నడుము వాటేసుకుని తాను కూడా పైకి వెళ్ళాడు. ఆకాశంలోకి చాలా ఎత్తు వెళ్ళేసరికి, సింద్‌బాద్‌కు స్వర్గం చేరువలోనే ఉన్నట్టూ, అక్కడి గంధర్వుల గానం వినిపిస్తున్నట్టూ తోచింది.

"అల్లా! ఏమి నీ మహిమ!" అన్నాడు అతను ఆనందపారవశ్యంతో.

మరుక్షణమే సింద్‌బాద్ వర్తకుడితో సహా రాయిలాగా కిందికి దిగి రాసాగారు. అయితే అదృష్టవశాన వారొక కొండశిఖరాన క్షేమంగా దిగారు. వర్తకుడు సింద్‌బాద్ కేసి కోపంగా చూసి, తిరిగి ఆకాశంలోకి ఎగిరిపోయాడు.

తన గతి ఇలా అయిందేమని విచారిస్తుండగా ఇద్దరు కుర్రాళ్ళు సింద్‌బాద్ ఉన్న వేపు వచ్చారు. వారి చేతిలో బంగారు బెత్తాలున్నాయి. సింద్‌బాద్ వారిని పలకరించాడు, కాని వాళ్ళు జవాబు చెప్పలేదు. వారిలో ఒకడు సింద్‌బాద్‌కు తనవద్ద ఉన్న బెత్తం ఇచ్చి, ఫలాని దిక్కుగా వెళ్ళమన్నట్టు చెయ్యి చూపాడు. సింద్‌బాద్ అటుగా బయలుదేరి వెళ్ళి, ఒకచోట మనిషిని మింగుతున్న పామును చూశాడు. అతను చేతనున్న బెత్తంతో మెడమీద ఒక్కటి కొట్టేసరికి పాము చచ్చింది. దాని నోటి నుంచి మనిషిని వెలికి తీస్తే, అతను సింద్‌బాద్‌ను ఆకాశంలోకి తీసుకుపోయినవాడే.

“అయ్యా, మీరు నా ప్రాణం కాపాడారు. ఇంతకు ముందు జరిగినదానికి క్షమించాలి. మీరు ఒక పేరు ఉచ్చరించగానే నాలో ఎగిరేశక్తి పోయింది. మేమా పేరు ఉచ్చరించము!” అన్నాడతను.

“నేనూ ఉచ్చరించనులే. ముందు నన్ను మా ఇంటికి చేర్చు,” అన్నాడు సింద్‌బాద్.

ఆ నగరంలో వాళ్ళు పిశాచగణాలకు పుట్టినవాళ్ళు. ఈ మాట సింద్‌బాద్ భార్య కూడా చెప్పింది. ఆమె కోరిక మీద అతను తన ఆస్తి అంతా అమ్మేసి సొమ్ము చేసుకుని, దానితో ఒక ఓడా కొంత సరుకూ కొని, భార్యతో సహా బాగ్దాదుకు వచ్చేశాడు.

అతన్ని చూసి అతని బంధుమిత్రులంతా చాలా సంతోషించారు. ఇక ఎన్నడూ ప్రయాణాలు చెయ్యనని అతను వారి వద్ద ప్రమాణం చేసి, యావజ్జీవం ఆ మాటమీదే ఉండిపోయాడు. —(అయిపోయింది)

